ప్రచురణ నెం. 5

సర్వహక్కులు :
చిక్కాల కృష్ణారావు

సమర్పణ :
నాగమణి

నిర్వహణ :
స్వామి యోగానంద

ప్రథమ ముద్రణ : 1994

ప్రతులు : 1000

ధర : రు. 15-00

ఖలీల్ జిబ్రాన్ గారి
"The Prophet"కి
స్వేచ్ఛానువాదం

ప్రతులకు :
చిక్కాల కృష్ణారావు
"కృష్ణ నిలయం", గొల్లవీధి,
భీమునిపట్నం-531 163.
విశాఖ జిల్లా.

ముద్రణ :
శ్రీ అరుణోదయ ప్రింటింగ్ ప్రెస్
సీతారామపురం, విజయవాడ-520 002. ఫోన్: 431422

# ముందుమాట

"ఖలీల్ జిబ్రాన్ రాసిన
"The Prophet" అనే పుస్తకం చదువు"
అని చలంగారు నాకు ప్రత్యేకించి
చెప్పడంతో వెంటనే శ్రీ రమణాశ్రమ
లైబ్రరీకివెళ్ళి, ఆ పుస్తకం తెచ్చి
చదివాను. ఆయన నన్ను
ఆ పుస్తకం ఎందుకు చదవమన్నారో
గ్రహించాను.

విశ్వ విఖ్యాత తత్వవేత్త
జిడ్డు కృష్ణమూర్తిగారు స్వయంగావెళ్ళి
ఖలీల్ జిబ్రాన్ని చూడ్డంలోని
విశిష్టతనూ గుర్తించాను.

ఆ తర్వాత ఆ పుస్తకాని
నాకు తోచిన రీతిని
అనువదించుకున్నాను.

ఆ వ్రాతప్రతి పాతికేళ్ళు
సూర్యుని చుట్టూ తిరిగిందేకాని,
వెలుగు చూడలేదు.

ఇప్పుడా ప్రతిని నాగమణిగారు బైటికి తీసి,
చదివి, యోగానందగారికి చూపి,
వెలుగులోకి తెచ్చారు.

కృష్ణ

"అల్ ముస్తఫా" ఉన్నతుడు, అందరికీ ప్రియతముడు.
ఆ కాలానికి వైతాళికుడు.

తిరిగి తనను జన్మభూమి తీసుకువెళ్ళేందుకు
రానున్న తన ఓడ కోసం ఆర్ఫలీజు పట్టణంలో
పన్నెండేళ్ళు వేచి వున్నాడు.

పన్నెండవ ఏట – పంటలు కోసే "ఇలుల్" నెల
ఏడవ రోజున, పట్టణ ప్రాకారాలకు వెలుపల
కొండఎక్కి సముద్రంవేపు చూశాడు.
పొగమంచుతోపాటు తన ఓడ రావడం గమనించాడు.

ఆయన హృదయకవాటాలు, తటాలున తెరచుకున్నాయి.
ఆయన ఆనందం, మహాంబుధి దాటి విస్తరించింది.
ఆత్మనిష్ఠుడై కళ్ళు మూసుకుని ప్రార్థించాడు.

కొండ దిగుతుండగా ఆయన్ని దుఃఖం ఆవహించింది.
హృదయాంతరాళంలో ఇట్లా అనుకున్నాడు;

దుఃఖ పడకుండా, శాంతంగా నేనెట్లా వెళ్ళగలను?
హృదయంలో ఒక్కగాయమైనా లేకుండా,
నే నీ నగరాన్ని వదలి వెళ్ళలేను.

ఈ పురప్రాకారాల్లో బాధాకరమైన
ఎన్నో పగటివేళల్ని, ఒంటరితనపు రాత్రుల్ని గడిపాను.
తన బాధనుంచీ, ఒంటరి తనం నుంచీ
పశ్చాత్తాప్పడకుండా ఎవరు మాత్రం దూరం కాగలరు?

ఈ నగర వీధుల్లో నా హృదయపు తునకలెన్నింటినో
వెదజల్లాను.
ఈ కొండల మధ్య నా ఆశాంకురాలెన్నో నగ్నంగా
నడయాడాయి.
ఏ బాధా, భారం లేకుండా నేను వాటి నుంచి
దూరం కాలేను.

ఈ రోజు విసిరి పారేయడానికి, ఇదొక ఉత్తరీయం కాదు.
ఇది - నా చేతులారా నా చర్మాన్ని నేను ఒలుచుకోవడం.

నా వెనక దిగవిడచి పోవడానికి, ఇది ఒక స్మృతి కాదు.
ఆకలి - దప్పికలతో మధురంగా మారిన హృదయమిది.

అయినా నేనింక ఎక్కువసేపు ఆలస్యం చేయను.

సమస్తాన్ని తనలోకి తీసుకునే మహాంబుధి
నన్నూ పిలుస్తోంది.
నేను ఓడ ఎక్కి వెళ్ళిపోవాలి.

వెళ్ళకుండా ఆగిపోవడమంటే,
నిత్య చైతన్యవంతమైన కాలచక్రగమనాన్ని
గమనించకుండా, ఘనీభవించి, స్ఫటికమై
మూసలో బందీకృతం కావడం.

ఇక్కడ వున్న వాటన్నింటినీ నా వెంట తీసుకుపోవడం
నాకెంతో ఇష్టం. కాని, నేనెట్లా తీసుకుపోగలను?

తనకు రెక్కల్ని ఇచ్చిన నాలుకను - పెదవుల్ని
వాక్కు తన వెంట తీసుకుపోలేదు.
అది ఒంటరిగానే ఆకాశమార్గాన్ని అన్వేషించుకోవాలి.

గూడు లేకుండా గ్రద్ధ ఒంటరిగా
సూర్యునికి అడ్డంగా ఎగురుతుంది.

ఆల్ ముస్తఫా పర్వతపాదం చేరి, మరొకసారి
సముద్రం వేపు చూశాడు.
తన ఓడ రేవుచేరడం గమనించాడు.
దాని ముఖ భాగాన, తన దేశీయులైన
నావికుల్ని చూశాడు.

ఆయన అంతరాత్మ వారిని గట్టిగా పిలిచి, ఇట్లా అన్నది;
అలల రౌతులారా, నా - సనాతన మాతృపుత్రులారా!
మీరు తరచు నా కలల్లోకి సముద్రయానం చేస్తూ
వచ్చారు. ఇప్పుడు, నా నిగూఢ స్వప్నమైన,
ఈ నా జాగ్రదవస్థలో మీరు వస్తున్నారు.

నేను బయలు దేరడానికి సిద్ధంగా వున్నాను.
నా ఆతృత, పై కెత్తిన తెర చాపలతో
వాలుగాలి కోసం ఎదురు చూస్తోంది.

స్తంభించిన ఈ వాతావరణం లోంచి,
నేను మరొకసారి గాలి పీల్చుకుంటాను.
మమకారంతో మరొకసారి వెనక్కి చూస్తాను.

ఆ తర్వాత నేనూ మీలో ఒకడిగా, మీ మధ్య
నిలుస్తాను.

అపార పారావారమా,
నిద్రిస్తోన్న ఓ మాతృమూర్తీ!
నువ్వు ఒక్కదానివే, సమస్త నదులకూ, ప్రవాహాలకూ
స్వేచ్ఛా ప్రదాయినివి, శాంత స్వరూపిణివి.

ఈ వాగు మరొక మలుపు తిరిగి,
ఈ వనంలో మరొకసారి గుస గుసలాడుతుంది.

పరిమితం లేని బంధువు, అపరిమితమైన
మహాసముద్రాన్ని చేరునట్లు, నేను నిన్ను చేరుకుంటాను.

ఆడవాళ్ళూ - మగవాళ్ళూ పరుగెత్తుకుంటూ
పొలాల్ని - ద్రాక్ష తోటల్ని దాటి
పురద్వారం దగ్గరకు చేరడం, ఆయన నడుస్తూనే చూశాడు.

వాళ్ళంతా ఆయన్ని పేరుపెట్టి పిలవడం,
ఆయన ఓడ వస్తోందని ఒకరికొకరు చెప్పుకోవడం,
పొలం నుంచి పొలానికి పొలికేకలు పెట్టుకోవడం-
అన్నీ విన్నారాయన.

అన్నీ విని, ఆయన తనలో తాను ఇట్లా అనుకున్నాడు;
విడిపోయేరోజు, కలుసుకునే రోజు అవుతుందా?
నా జీవన సంధ్యా సమయం, నిజంగా
నా ఉదయ కాలంగా పరిగణింపబడుతుందా?

పొలం సగం దున్ని, చాలు మధ్యలో నాగలి వదలి
వచ్చిన వారికీ, ద్రాక్ష రసం పిండే యంత్రచక్రాన్ని
మధ్యలో నిలిపి వచ్చిన వానికీ నేనే మివ్వగలను?

పోగుజేసి వాళ్ళందరికీ ఇవ్వడానికి,
నా హృదయం పళ్ళతో నిండిన చెట్టా?

వారి పాత్రల్ని నింపేందుకు, నా కోర్కెలు
ఎగజిమ్మి ప్రవహించే వూటలా?

పరమేశ్వరుని అమృతహస్తం నన్ను తాకేందుకు,
నేనేమైనా వీణనా?
ఆయన శ్వాస నాలోంచి వెలువడేందుకు,
నేనేమైనా వేణువునా?

నేను మౌనాన్వేషకుణ్ణి. విశ్వాసంతో పంచి పెట్టడానికి
ఆ మౌనాన్వేషణలో నేను ఏ నిధుల్ని కనుక్కున్నాను?

ఇది పంట కోసుకునే కాలమైతే,
నాకు జ్ఞాపకం లేని ఏ ఏ ఋతువుల్లో
ఏ ఏ పొలాల్లో విత్తనాలు చల్లాను?

ఇది నిశ్చయంగా నా దీపాన్ని వెలిగించుకునే
సమయమైతే, నా దీపాన్ని పైకెత్తుతాను.
అందు వెలిగేది నా వత్తి కాదు.
ఆరిపోయి, కొడికట్టిన నా వత్తిని,
ఆ కాంతి స్వరూపుడే వెలిగిస్తాడు, అందు నూనె పోసి.

ఈ సంగతులన్నీ ఆయన మాటల్లో చెప్పారు:

నిగూఢ రహస్యాల్ని మాటల్లో చెప్పలేం కనుక,
అనేక విషయాలు ఆయన హృదయాంతరాళంలో
మౌనంగా వుండిపోయాయి.

ఆయన నగరం ప్రవేశించగానే, అందరూ ఆయన చుట్టూ
చేరి, ఏక కంఠంతో విలపించారు.

పుర పెద్దలు ముందుకు వచ్చి, "మీరు మమ్మల్ని
విడిచి వెళ్ళిపోకండి. మా జీవన సంధ్యా సమయంలో
మీరు మధ్యాహ్నపు తీవ్ర కాంతిగా వున్నారు.
మీ యవ్వనం, మాకు కలలు కనే శక్తిని ఇచ్చింది.
మీరు మాకు అపరిచితులూ కారు, అతిథీ కారు.
మీరు, మా కుమారులు.
మాకు ప్రియాతి ప్రియమైన ప్రియతములు.

మీ ముఖ దర్శనం కోసం ఆత్రుతతో వున్న
మా కళ్ళను, బాధ పెట్టకండి," అన్నారు.

ఆ తర్వాత అర్చకులు - పూజారిణులు
ఆయనతో ఇలా అన్నారు;
"సముద్రపు కెరటాలు ఇప్పుడే మనల్ని వేరు చేయ
నీయకండి. మీరు మా మధ్య గడపిన సంవత్సరాలు
స్మృతిగా మారిపోయాయి. మీరు మా మధ్య
దివ్యాత్మగా మసిలారు. మీ నీడ, మా ముఖాల
తేజస్సై వెలిగింది. మేము, మిమ్మ ఎంతగానో
ప్రేమించాము. కాని, మా ప్రేమ; మునుగుల్లో
మరుగుపడి, మూగదైపోయింది. అయినా
ఇప్పుడా ప్రేమ తనను తాను వ్యక్త పరచుకోవా
లని, మీ ముందు నిలబడి బిగ్గరగా ఏడుస్తోంది.
వియోగ సమయం వరకు ప్రేమకు సైతం తన
లోతు, తనకు తెలియదు. ప్రేమ సంగతి
ఎప్పుడూ ఇంతే!

మిగిలిన వారు కూడా ముందుకు వచ్చి,
ఆయన్ని వెళ్ళవద్దని బ్రతిమాలారు.
ఆయన జవాబు చెప్పక, తల క్రిందికి వంచారు.
ఆయన రొమ్ము మీద కన్నీరు జారి పడటం
ఆయనకు బాగా దగ్గరగా వున్నవారు చూశారు.
ఆయనా, వారూ కలిసి దేవాలయం ముందున్న
పెద్ద ప్రాంగణం వైపు నడిచారు.

ఆ ఆలయం లోంచి ఒకామె బైటికి వచ్చింది.
ఆమె ఒక మహాత్మరాలు.

ఆయన ఆమె వంక ఎంతో ప్రేమగా చూశారు.
ఆయన ఆర్ఫలీజ్ పట్టణం వచ్చిన మొదటి రోజున
ఆమే, ఆయన్ని మొదట చూసి, విశ్వసించింది.
ఆమె ఆయనకు అభివందనం చేసి,
పరమేశ్వర ప్రవక్తా, పరిపూర్ణమైన అన్వేషణలో
రానున్న మీ ఓడ కోసం చాలా కాలం సుదూరాలు
గాలించారు. ఇప్పుడు మీ ఓడ వచ్చింది. ఇంక
మీరు వెళ్ళక తప్పదు. మీ స్మృతులకు నిలయం,
మీ ప్రగాఢ వాంఛలకు నివాసమైన ప్రదేశం
చేరుకోవాలని మీరు ఎంతో ఆరాట పడ్డారు.
మా ప్రేమ, మిమ్మల్ని బంధించదు. మా అవసరాలు,
మిమ్మల్ని ఆపుజేయవు. కాని, మీరు మమ్మల్ని
వదలి వెళ్ళే ముందు, మాదొక మనవి; మీరు
తెలుసుకున్న సత్యాన్ని మాకు వివరించి చెప్పండి.
దాన్ని మేము, మా పిల్లలకు చెప్పుకుంటాం. వారు
దాన్ని తమ సంతతికి తెలియజెప్పుకుంటారు.
ఆ సత్యం ఎప్పటికీ నాశనం కాదు.

మీరు మా మధ్య ఒంటరిగా వుండి, మా పగటివేళల్ని
గమనించారు. మేము నిద్రలో నవ్విన నవ్వుల్ని,
ఏడ్చిన్న ఏడ్పుల్ని మీరు ఎరుకలో వుండి విన్నారు.
కనుక మీరు ఇప్పుడు మమ్మల్ని మాకు తెలియ
జేయండి. మీ రాక - పోకల మధ్య, మీరు గమనించిన
దంతా మాకు పూర్తిగా తెలియ జెప్పండి.
"ఆర్ఫలీజ్ వాసులారా, ఈ క్షణం వరకు మా అంతరాల్లో
మసలే దాన్నితప్ప నేను ఇంకేం చెప్పగలను?" అన్నారాయన.

* * *

# 1

"మాకు ప్రేమ గురించి చెప్పండి, "అని ఆల్ మిత్రా ఆయన్ని అడిగింది.

ఆల్ ముస్తఫా తల పైకెత్తి, అందరి వంకా చూశారు. అనిర్వచనీయమైన ప్రశాంతత వారందరిపై వర్షించింది. గంభీర స్వరంతో ఆయన ఇట్లా చెప్పారు:

ప్రేమ మార్గం కఠినమైనా, నిటారైనా
అది సౌంజ్ఞ చేయగానే, మీరు దాన్ని అనుసరించండి.
దాని రెక్కల మధ్య నున్న కత్తి, మిమ్మల్ని గాయపరచినా,
అది రెక్కలు విప్పగానే, మీరు దాని వశమైపోండి.
శిశిరం తోటంతనీ ధ్వంసం చేసినట్లు
ప్రేమవాణి మీ కలల్ని కతునాతునకలు చేసినా,
అది మీతో సంభాషించినప్పుడు;
మీరు దాన్ని విశ్వసించండి.

ప్రేమ మిమ్మల్ని పట్టాభిషిక్తుల్ని చేసినట్లే,
అది మిమ్మల్ని శిలవ కూడా వేయిస్తుంది.
అది మీ పురోభివృద్ధికి తోడ్పడునట్లే,
మిమ్మల్ని తెగటార్చడానికి అది సిద్ధమౌతుంది.
అది మీ ఔన్నత్యం పైకెగసి, సూర్యకాంతిలో చలించే
మీ మృదు అధరాల్ని చుంబించినట్లే, కిందికి దిగి
భూమిని గట్టిగా అంటిపెట్టుకున్న
మీ పాదాల్ని ఊపేస్తుంది.

పండిన ధాన్యం కంకుల్ని కోసి, కుప్పేసినట్లు,
ప్రేమ మిమ్మల్ని తన దగ్గరకు తీసుకుంటుంది.
ధాన్యాన్ని రాలగొట్టినట్లు,
ప్రేమ, మిమ్మల్ని బంధ విముక్తుల్ని చేస్తుంది.
మీరు సహజ స్వభావులుగా వుండాలనీ,
మిమ్మల్ని సంపూర్ణ స్వేచ్ఛా పరుల్ని చేయాలనీ,
ధాన్యాన్ని దంచినట్లు, ప్రేమ మిమ్మల్ని దంచి,
పొట్టంతనీ చెరుగుతుంది.

మీరు సాధు స్వభావులుగా వుండాలని,
ప్రేమ మిమ్మల్ని బాగా కలిపి, దగ్గరగా చేరుస్తుంది.
దేవతా నైవేద్యానికి పనికి వచ్చే పవిత్ర పదార్థంగా
మిమ్మల్ని తయారు చేయాలని,
తన పవిత్రాగ్నికి మిమ్మల్ని ఆహుతి చేస్తుంది.

మీ హృదయ రహస్యాలు మీరు తెలుసుకునేందుకు,
ప్రేమ ఇవన్నీ చేస్తుంది, మీ కోసం.
ఆ సంగతులన్నీ తెలుసుకున్న మీరు,
అనుభవ జ్ఞానంతో జీవన హృదయంలో ఒక భాగం
అవుతారు.

మీరు మీ భయాలవల్ల, ప్రేమ నుంచి
శాంతినీ, సంతోషాన్నీ వెదుకుతారు.
సహజత్వాన్ని మూసుకోవడం కన్నా,
ప్రేమ ప్రాంగణం దాటి వెళ్ళిపోవడం నయం.
మీరు అలా దాటి వెళ్ళి, క్రమ రహిత ప్రపంచంలో
నవ్వుతారు - కాని, మా నవ్వంతనీ, నవ్వలేరు.
ఏడుస్తారు - కాని, మీ ఏడుపు అంతటినీ ఏడ్వలేరు.

ప్రేమ, తనను తప్ప మరేమీ ఇవ్వలేదు.
ప్రేమ, ప్రేమ నుంచి తప్ప, మరి దేని నుంచీ
ఏదీ తీసుకోదు.

ప్రేమ, స్వయం పరిపూర్ణం.
ప్రేమకు ప్రేమ చాలు.

మీరు ప్రేమించినప్పుడు—
ఈశ్వరుడు నా హృదయంలో ఉన్నాడనటం కన్నా,
ఈశ్వర హృదయంలో నేను ఉన్నాను అనడం ఉత్తమం.
ప్రేమకు మార్గం చూపి నడపగలననుకోకండి.
మీరు యోగ్యులని, ప్రేమ గుర్తిస్తే,
అదే మీకు దారి చూపి నడుపుతుంది.

తనను పరిపూర్ణం చేసుకోవడం తప్ప,
ప్రేమకు మరో ఉద్దేశ్యం లేదు.

మీరు ప్రేమిస్తే, ఆ ప్రేమకు అనుగుణంగా
మీలో కొన్ని కోర్కెలు కలిగితే, అవి—
రాత్రి వేళకు మధురంగా పాడేందుకు
కరిగి, పరిగెత్తే సెలయేరుగా మారాలనీ,
అతి సుకుమారపు బాధను అర్థం చేసుకోవాలనీ,
ప్రేమానుభవంతో గాయ పడాలనీ,
సంకల్పంతో, సంతోషంతో రక్తం కార్చాలనీ,
తెరచుకున్న హృదయకవాటంతో ఉదయం మేల్కోవాలనీ,
ప్రేమించడానికి మరో రోజు లభ్యమైనందుకు
ధన్యవాదాలు అర్పించాలనీ,
ప్రేమ పారవశ్యంలో మధ్యాహ్న వేళ,

విశ్రాంతిగా వుండాలనీ,
సూర్యాస్తమయ వేళ కృతజ్ఞతతో ఇల్లు చేరుకోవాలనీ,
ప్రియతముని కోసం హృదయంలో ప్రార్థిస్తో—
పెదవులపై స్తుతి గీతాలు ఆలాపిస్తో నిద్రించాలనీ—
కోరుకోండి.

*　　　*　　　*

# 2

"గురుదేవా, వివాహం అంటే ఏమిటి?" అని
ఆల్ మిత్రా మళ్ళా అడిగింది.
ఆయన జవాబుగా ఇట్లా చెప్పారు.

మీరు జంటలుగా పుట్టారు.
ఎప్పటికీ జంటలుగా కలిసే వుంటారు.
మీ జీవితాల్ని శ్వేత వర్ణపు మృత్యు హస్తాలు
చెల్లా చెదురు చేసినా, మీరు జంటలుగానే వుంటారు.

ఈశ్వరుని నిశ్చల స్మృతిలో సైతం, మీరు
జతలుగా కలిసే వుంటారు.
కాని, మీ ఐక్యతలో ఎడం వుండేటట్లూ,
స్వర్గ సమీరాలు మీ మధ్య నాట్యమాడేటట్లూ చూడండి.

మీరు ఒకరి నొకరు ప్రేమించుకోండి.
కాని, ఆ ప్రేమ, బంధం కావడం కన్నా,

అది మీ ఆత్మతీరాల మధ్య కదలాడే కడలిగా
వుండటం నయం.
ఒకరి పాత్రను ఒకరు నింపుకోండి కాని,
ఒకే పాత్ర నుంచి తాగకండి.
ఒకరి రొట్టెను ఒకరికి ఇచ్చుకోండి కాని,
ఒకే రొట్టె, కొరుక్కుని తినకండి.

ఒకే లయకు వీణ తీగలు కలిసి ప్రకంపించినా,
అవి విడి - విడిగా వున్నట్లు: మీరు కలసి - మెలసి
హాయిగా ఆడుతూ, పాడుతూ వుండండి కాని,
ఎప్పుడూ ఏకాంతంగానే వుండండి.

జీవన హస్తం ఒక్కటే హృదయాల్ని హత్తుకుంటుంది కనుక,
మీరు ఒకరి హృదయాల్ని ఒకరికి అర్పించుకోండి కాని,
ఒకరి చేతుల్లో ఒకరు చిక్కుకోకండి.

దేవాలయ స్తంభాలు విడి - విడిగా వున్నట్లు
మీరు జంటగా నిలవండి కాని, అంటుకుని వుండకండి.

ఒకే వృక్షం - సైప్రెస్ - ఒక దాని నీడలో ఒకటి
మనజాలవు.

* * *

# 3

తన బిడ్డను రొమ్ముకు హత్తుకున్న ఒకామె,
"మాకు పిల్లల గురించి చెప్పండి" అని అడిగింది.
ఆయన చెప్పారు:

మీ పిల్లలు, మీ పిల్లలు కారు.
తన పరిపూర్ణ త కోసం జీవితంపడే
తపన ఫలితంగా ఆవిర్భవించిన వారే
మీ కొడుకులూ, కూతుళ్ళు.
వారు మీ ద్వారా ఆవిర్భస్తారేకాని, మీ నుంచికాదు.
వారు మీతో వున్నా,
మీకు సంబంధించిన వారూ కాదు.

వారికి మీ ప్రేమను ఇవ్వగలరేమోకాని,
మీ ఆలోచనలను, వారికి ఇవ్వలేరు.
వారి ఆలోచనలు వారికి వుంటాయి.
వారి ఆత్మలు "భవిష్యత్తు" అనే భవనంలో
నివసిస్తాయి కనుక,
వారి ఆత్మలకు ఇళ్ళు కట్టలేరు;
వారి దేహాలకు గృహాలు నిర్మించగలరేమో కాని,
మీరు కనీసం కలలో కూడా ఆ భవనంలో ప్రవేశించలేరు.

జీవితం వెనక్కి పోదు, - గతంలో కలసి వెనక దిగబడిపోదు
వారిని మీ వలె తయారు చేయాలని చూడకండి.

మీరు వారి మాదిరిగా వుండేందుకు
గట్టి ప్రయత్నం చేయగలరేమో కాని.
మీరు ధనుస్సులు వంటి వారు.
మీ పిల్లలు మీ నుంచి విడువబడ్డ సజీవ బాణాలు.
అనంతత్వపు బాట మీద విలుకాడు
ఒక లక్ష్యాన్ని దృష్టిలో పెట్టుకుని
తన బాణాలు దూరంగా - వేగంగా పోయేందుకు
ధనుస్సులు వంటి మిమ్మల్ని తన శక్తి కొలది వంచుతాడు.

ఆ విలుకాడు, తన నుంచి దూసుకుపోయే
బాణాల్ని ప్రేమించినట్లే, తన చేతిలో స్థిరంగా వున్న
ధనుస్సునీ ప్రేమిస్తాడు. అతని చేతిలో మీరు
వంచబడటం ఆనందదాయకం.

* * *

# 4

"దానం అంటే ఏమిటి?" అని ఒక ధనవంతుడు -
అడిగాడు.
ఆయన చెప్పారు;
మీ స్వాధీనంలో వున్న వాటిని ఇచ్చేప్పుడు,
బహు కొంచెమే ఇస్తారు.
రేపటికి అవసరమౌతాయనే భయంతో
పోగుజేసి, జాగ్రత్తగా భద్రపరచుకున్న

వస్తు సముదాయమే, ఆస్తి - పాస్తులు.
వాటిని హృదయ పూర్వకంగా ఇవ్వడమే,
నిజంగా ఇవ్వడం.

యాత్రికుల వెంట వెళ్ళే అతి తెలివి గల కుక్క,
దారిలో తనకు దొరికిన ఎముక ముక్క,
రేపటికి అవసరమౌతుందని
నిర్జన ప్రదేశంలో పూడ్చిపెట్టినట్లుంది—
మీరు మీ ఆస్తి - పాస్తుల్ని రేపటికి దాచుకోవడం.
అసలు అవసరం కాక, అవసరమౌతుందనే
భయం ఏమిటి?
నూతి నిండా నీళ్ళు వున్నప్పుడు,
తీరని దాహం, దప్పిక భీతి కాదా?

కీర్తి కోసం కొందరు తమ కున్న అపార సంపద నుంచి
అల్పంగా దానం చేస్తారు. ఆ దానంలో దాగి వున్న
వారి రహస్యవాంఛే, ఆ దానాన్ని అరిష్టదాయకం
చేస్తుంది.

తమకు కొంచెమే వున్నా, దాన్నంతా దానం చేస్తారు,
కొందరు. వారు, జీవితంలో - జీవితదాతృత్వంలో
విశ్వాసం వున్న వారు. వారి భోషాణం ఎప్పుడూ
ఖాళీ కాదు.

కొందరు సంతోషంతో ఇస్తారు. ఆ సంతోషమే
వారికి ప్రతిఫలం.
కొందరు బాధపడుతూ ఇస్తారు. ఆ బాధే, వారికి
ప్రాయశ్చిత్తం.

కొందరు ఇస్తారు కాని, ఆ ఇవ్వడంలో వారు
ఆనందాన్ని ఆశించరు, బాధా పడరు.
అసలు దానాన్నే ఒక సత్కార్యంగా భావించరు.
వారు చేసే దానం, దూరపు లోయలోని కదంబం
తన పరిమళాన్ని విరజిమ్ముతున్నట్లు వుంటుంది.

అటువంటి వారి చేతుల ద్వారా, ఈశ్వరుడు
పలుకుతాడు. వారి కళ్ళ వెనుక నుంచి
ఈశ్వరుడు చిరునవ్వు నవ్వుతాడు.

అర్థించినప్పుడు ఇవ్వడం మంచిదే కాని,
అడగనప్పుడు అవసరం గుర్తించి ఇవ్వడమే,
గొప్ప సంగతి.
దానం చేయడం కన్నా, నిస్సహాయులను వెదకడం
ఉదార హృదయులకు గొప్ప సంతోషం.
ఇవ్వకుండా దాచిపెట్టుకోవడానికి
అసలు మీదంటూ ఏముంది?
ఒక రోజున మీకున్నదంతా ఇవ్వవలసిందే!
అందుచేత, ఇప్పుడే ఇవ్వండి.
ఆ ఇచ్చే తరుణం మీదికాని, మీ వారసులది కాదు.

"పాత్రులైన వారికే దానం చేస్తాం," అని మీరు
తరచు అంటూ వుంటారు. కాని, మీ తోటలోని
చెట్లూ, మీ పచ్చిక బయళ్ళలో మేసే గొర్రెలూ
అట్లా అనవు. "ఇవ్వకుండా దాచుకోవడం,
నాశనానికే," అని, అవి అనుకుని, తాము జీవింప గోరి,
మీకు అర్పించుకుంటాయి.

తన జీవితకాలాన్ని అనుభవించడానికి
అర్హుడైన వాడు, మీ నుంచి సమస్తాన్ని
స్వీకరించడానికి అర్హుడే!
జీవన మహార్ణవం నుంచి తాగడానికి
యోగ్యుడైన వాడు, మీ చిన్న సెలయేరు నుంచి
తన పాత్ర నింపుకోవడానికి అర్హుడే!

ఆ ఇచ్చి - పుచ్చుకోవడంలో, సాహసం - ఆత్మ విశ్వాసం
కలిగి వుండటం కన్నా, గొప్ప సంగతి ఏముంది?

మనుష్యులు తమ హృదయాల్ని, ఆత్మాభిమానాల్ని
చంపుకుని, సిగ్గు విడిచి మీ ముందు నిలిచి, అర్థించా
రంటే; అసలు మీరెవరో, మీరు తెలుసుకోండి.
అసలు దానం చేసే అర్హత మీకు వుందో, లేదో
ముందు ఆ సంగతి మీకు మీరు తేల్చుకోండి.
ఏది చేయడానికీ, మీరు ఉపకరణాలు మాత్రమే!

నిజం చెప్పాలంటే, జీవితానికి జీవితమే ఇస్తుంది.
మీరు దానపరులమనుకుంటారు గాని,
మీరు కేవలం సాక్షులు మాత్రమే.

పరిగ్రహీతులారా, అందరూ ఆ అక్షయ పాత్ర
నుంచి అందుకునే వారే.
కృతజ్ఞతా భారాన్ని ఒక కాడిగా భావించి,
దాన్ని దాత భుజం మీదా, స్వీకరించిన
మీ భుజం మీదా భారంగా మోపుకోకండి.
కామధేనువైన భూమి, తల్లిగాను,
ఈశ్వరుడు తండ్రిగాను భావించి ఇచ్చిన వాని

దాతృత్వాన్ని శంకించడం, ఋణ పడ్డానని
ఎక్కువగా అనుకోవడానికి కారణమౌతుంది.
అంతకన్నా, స్వీకరించిన కానుకలు రెక్కలుగా
చేసుకుని, దాతతో కలిసి పైకెగరడం నయం.

*　　　*　　　*

# 5

"తినడం - తాగడం అంటే ఏమిటి?" అని
వృద్ధుడైన ఒక సత్రపు గుమాస్తా అడిగాడు.
ఆయన చెప్పారు;
మట్టి పరిమళం పీల్చి, వెలుతురు మేసి లత
వలె, జీవించవచ్చు. కాని, మీరు తినడానికి
ఒకదాన్ని చంపవలసి వచ్చినా, దప్పిక
తీర్చుకోవడానికి లేగదూడ నోరుకొట్టి, దాని
తల్లి పాలు దొంగిలించవలసి వచ్చినా
ఆ కృత్యాల్ని కూడా ఒక ఆరాధనగా జరుపుకోండి.

ఎంతో పవిత్రమూ-అమాయకమూ అయినవీ,
అడవుల్లో - పచ్చిక మైదానాల్లో తిరిగేవీ,
అంతకన్న పవిత్రమూ - అమాయకమూ అయిన
మిమ్మల్ని కాపాడేందుకు అవి తమ జీవితాల్ని
త్యాగం చేస్తాయి. కనుక, మీ వంట ఇంటిని
ఒక యజ్ఞ వేదికగా మార్చుకోండి.

మీరు ఒక మృగాన్ని చంపేటప్పుడు,
మీ హృదయంలో దానికి ఇట్లా చెప్పండి:
ఏ న్యాయం నిన్ను నా చేతులకు అప్పగించిందో,
ఆ న్యాయమే నన్ను అంతకన్నా శక్తివంతమైన
చేతులకు అప్పగిస్తుంది. నిన్ను వధించే శక్తే,
నన్నూ వధిస్తుంది. నీ వలె, నేను కూడా
ఆరగింపబడతాను.

నీ రక్తం, నా రక్తం స్వర్గ వృక్షాన్ని పెంచే సారం.

యాపిల్ పండును మీరు కొరుక్కుని తినేప్పుడు,
మీ హృదయంలో దానికి ఇట్లా చెప్పండి;
నీ విత్తనాలు నా దేహంలో మొలకెత్తుతాయి.
నేటి నీ మొగ్గలు, రేపు నా హృదయంలో విచ్చుకుంటాయి.
నీ పరిమళం, నా శ్వాస అవుతుంది. అన్ని ఋతువుల్లో
మన మిద్దరం కలసి, మెలసి జంటగా, ఆనందంగా
వుంటాము.

సారాయి తయారు చేయడం కోసం
శిశిరంలో ద్రాక్ష పళ్ళుకోసి పోగుజేసేటప్పుడు,
"నేను కూడా ఒక ద్రాక్ష తోటనే! సారాయి
తయారు చేయడం కోసం నా పళ్ళు కూడా కోసి,
పోగుజేస్తారు. కొత్త సారాయివలె, నన్నూ
శాశ్వత భాండాల్లో నింపుతారు," అని
మీ హృదయంలో అనుకోండి.

శీతాకాలంలో ఆ ద్రాక్ష సారాయి తాగేటప్పుడు,
ప్రతి కప్పుకీ మీ హృదయంలో ఒకపాట పలకాలి;

ఆ పాటలో ఆకు రాలు కాలం గురించీ, ద్రాక్ష తోట గురించీ, సారాయి తయారుచేసే యంత్రం గురించిన స్మృతులు వుండాలిః

*   *   *

# 6

"పని చేయడమంటే ఏమిటో మాకు చెప్పండి,"
అని ఒక కర్షకుడు ఆల్ముస్తఫాను అడిగాడు.
జవాబుగా ఆయన ఇట్లా చెప్పారు:
సోమరిగా వుండటమంటే, ఋతువులకు
అపరిచితులుగా వుండటం. అనంతత్వం వైపు
గంభీరంగా - గర్వంగా సాగిపోయే
జీవిత ప్రస్థానం నుంచి వైదొలగడం.
భూమితోను - దాని ఆత్మతోను మీరు సమంగా
స్పందించడమే, శ్రమించడం.

పని చేసేటప్పుడు మీరు వేణువులు.
ఆ వేణువుల యెదలలో కాలపు గుసగుసలు
సంగీత స్వరాలుగా మారతాయి.
సమస్త చరాచరం సమశ్రృతిలో కలిసి పాడుతో వుంటే,
మీలో ఎవరు మాత్రం కదలక - పలకక
వుత్తరెల్లు లాగ పడి వుంటారు?

"శ్రమ, శాపం. కష్టపడి పని చేయడం దుర్దశ," అని
మీలో కొందరు ఎప్పుడూ అంటూ వుంటారు.
కాని, నేనంటాను, "ఆదిలో భూదేవి కలలు కనినప్పు
డే, మీరు ఒక పనికి నియమితులైనారు.
మీరు ఆ పనిని చేస్తున్నప్పుడు, ఆమె కనిన
స్వప్నంలోని ఒక భాగం నెరవేర్చిన వారౌతారు.
మిమ్మల్ని మీరు పనిలో ప్రవేశపెట్టుకోవడమే,
జీవితాన్ని నిజంగా ప్రేమించడం.

శ్రమ ద్వారా జీవితాన్ని ప్రేమించడం,
నిగూఢమైన జీవిత రహస్యాలతో
సన్నిహిత సంబంధం కలిగి వుండటం.

కాని, "జన్మించుటే, పాపం. దేహ పోషణే
నుదుట రాసిన శాపం," అని మీరు బాధల్లో వున్నప్పుడు
అనుకుంటే, "నుదుటి శ్రమతో, తల రాత
కడగవచ్చు," అని నేనంటాను.

"జీవితం అంధకారమయం" అని అలసిన వారు
మీతో అన్నమాట, అది.
మీరు అలసటగా వున్నప్పుడు ఆ మాట మీలో
ప్రతిధ్వనిస్తుంది.
ప్రేరణ లేకపోతే, జీవితం నిశ్చయంగా అంధకారమయం.
జ్ఞానం లేకపోతే, ప్రేరణ అంతా గుడ్డిదే అవుతుంది.
శ్రమ పడకపోతే, జ్ఞానమంతా వ్యర్థం.
ప్రేమ లేకపోతే, శ్రమంతా శూన్యం.

మీరు ప్రేమతో పని చేస్తున్నప్పుడు
మీరు మీతోనూ, ఇతరులతోనూ, ఈశ్వరుడి తోనూ
సత్సంబంధం కలిగివుంటారు.

ప్రేమతో పని చేయడమంటే,—
హృదయ తంతువుల్ని దారాలుగా తీసి, బట్టగా నేసి,
దాన్ని తమ ప్రియతముడు ధరిస్తాడని అనుకుని
పని చేయడం—

అనురాగంతో గృహ నిర్మాణం చేసి, అందు తమ
ప్రియతముడు నివసిస్తాడని అనుకుని శ్రమించడం—
ఆప్యాయతతో విత్తనాలు చల్లి, ఆనందంతో పంట కోస్తే,
ఆ ఫలసాయాన్ని తమ ప్రియతముడు
అనుభవిస్తాడని అనుకుని కష్టించడం—

మనసంతటితో రూపొందించిన వాటిని
ఆత్మ చైతన్యంతో నింపడం.
అన్నీ ఆయన ఆధీనంలో వుంచడం.
మృతి చెందిన మహాత్ములందరూ, మీ చుట్టూ
నిలబడి మిమ్మల్ని పరిశీలిస్తున్నారనుకోవడం.

తాను చెక్కే చలువరాయిలో
తన ఆత్మ స్వరూపాన్ని దర్శించే శిల్పి,
పొలందున్నేవాని కన్నా ఘనుడనీ—
ఇంద్రధనస్సులోని వర్ణాల్ని మనసులో గట్టిగా నిలుపుకుని
వాటిని నారగుడ్డపై మానవాకృతిలో చిత్రించేవాడు
చెప్పులు కుట్టేవాని కన్నా ఘనుడనీ
తరచు మీరు కలలో పలవరించినట్లు అనడం
నేను విన్నాను.

కాని, నేనంటాను - నిద్రపోతూ కాదు - పూర్తిగా
మేల్కొన్న - కేంద్రీకృతమైన జాగృతిలోంచి,
"అన్నిటి కన్నా అతి అల్పమైన గడ్డి పరకలను
ఉపేక్షించి, బ్రహ్మాండమైన ఓక్ వృక్షాలతో
గాలి అతి మధురంగా మాట్లాడదు," అని.
గాలి గుస గుసల్ని ఎంతో ప్రేమతో మధురస్వరాలుగా
మలచ గలిగిన వాడే ఘనుడు," అని కూడా అంటాను.

రూపొందిన ప్రేమే, పని.
ఉపేక్షా భావంతో రొట్టె కాలిస్తే, అది చేదై, సగం
ఆకలిని చంపేస్తుంది, అయిష్టంతో ద్రాక్ష రసం
పిండితే, అది విష పూరితమవుతుంది.
ప్రేమ రహితంగా పని చేయడం కన్నా, ఆ పనిని
వదిలేసి, దేవాలయం వద్ద కూర్చుని, సంతోషంతో
పని చేసిన వారు ఇచ్చే భిక్ష తీసుకోవడం నయం.

సంగీతాన్ని ప్రేమించకుండా, గంధర్వుడిలా పాడినా,
ఆ పాట, రాత్రింబవళ్ళు విన వచ్చే దివ్యనాదాల నుంచి
మనిషి చెవులకు మూత వేయడమే అవుతుంది.

* * *

# 7

"ఆనందం, అంటే ఏమిటి? దుఃఖం, అంటే ఏమిటి?"
అని ఒకామె అడిగింది.
ఆయన జవాబు చెప్పారు;

ఆచ్ఛాదరహిత విషాదమే, ఆనందం.
ఏ బావిలోంచి మీ నవ్వులు పెల్లుబుకుతాయో,
ఆ బావే అప్పుడప్పుడూ మీ కన్నీళ్ళతో నిండుతుంది.
అది అట్లా కాకపోతే, మరెట్లా సంభవం?
దుఃఖం మిమ్మల్ని లోలోపలికి తొలిచే కొద్దీ,
మీరు మరింత పరమానందాన్ని అనుభవిస్తారు.
మీ మధు పాత్ర, కుమ్మరి వాని కొలిమిలో కాలినదే కదా?
మీ ఆత్మను ఉపశమింపజేసే వీణ,
ఉలితో తొలచబడిందే కదా?
ఆనందంగా వున్నప్పుడు, అంతరాత్మలోకి చూసుకోండి.
ఏదైతే మీకు దుఃఖాన్ని కలిగిస్తుందో,
అదే మీకు ఆనందాన్ని ఇస్తుందనీ తెలుసుకుంటారు.
దుఃఖంతో వున్నప్పుడు. మీ హృదయాంతరాళంలోకి
చూసుకోండి.
నిజం చెప్పాలంటే, మీరు సంతోషం పొందడానికి
ఏదైతే కారణ మౌతుందో దాని కోసమే మీరు
విలపిస్తారనీ తెలుసుకుంటారు.

దుఃఖం కన్నా ఆనందం గొప్పదని, మీలో కొందరు అంటారు.
కాదు, దుఃఖమే గొప్పదంటారు మరి కొందరు.
కాని, ఆ రెండూ అభేద్యమైనవని నేనంటాను.
ఆ రెండూ ఎప్పుడూ కలిసే వస్తాయి.
ఒకటి మీ సహపంక్తిని భోజనానికి కూర్చుంటే,
రెండోది మీశయ్యపై నిద్రిస్తూ వుంటుందని మరచిపోకండి.

త్రాసులోని సిబ్బెలు మాదిరిగా,
మీరు సుఖ - దుఃఖాల మధ్య వేళ్ళాడుతూ వుంటారు.
సుఖ - దుఃఖాలు అనేవి లేనప్పుడే,
మీరు స్థిరంగా - నిశ్చలంగా వుంటారు.
సకలైశ్వర్యేశ్వరుడు తన వెండి, బంగారాల్ని
తూచుకోవడానికి మిమ్మల్ని తీసుకున్నప్పుడు,
మీ సుఖ - దుఃఖాలు క్రిందు - మీదులు అవుతాయి.

*                    *                    *

# 8

"మాకు గృహాల గురించి చెప్పండి" అని ఒక తాపీమేస్త్రి
ముందుకు వచ్చి వారిని అడిగాడు.
జవాబుగా ఆయన ఇట్లా చెప్పారు:

పురప్రాకారాల్లో మీరు ఒక ఇల్లు కట్టుకునేముందు,
ఊహా వనవాటికను ఒకదాన్ని నిర్మించుకోండి.
సంధ్య వేళ మీరు ఇల్లు చేరుకున్నట్లే,

ఎప్పుడూ ఒంటరిగా దూరాల తిరుగాడే మీలోని
లోక సంచారి కూడా ఆ, మీ కల్పనా గృహం చేరుకుంటాడు.

విస్తృతమైన మీ దేహమే, మీ గృహం.
అది సూర్యకాంతిలో పెరుగుతుంది.
రాత్రి నిశ్చలత్వంలో, నిద్రిస్తుంది.
అది స్వప్న రహితమైనది కాదు.
మీ గృహం కలలు కనదా? అది కలలు కంటూ,
నగరం వదలి వనాలకూ, పర్వత శిఖరాలకూపోదా?

మీ ఇళ్ళు అన్నింటినీ పోగుచేసి నా చేతుల్లోకి
తీసుకోగలిగితే, వాటిని విత్తనాలు చల్లినట్లు,
అడవుల్లో - మైదానాల్లో వెదజల్లే వాడిని.
అప్పుడు లోయలు మీ వీధులుగా,
పచ్చని బాటలు చిన్న చిన్న సందులుగా వుండేవి.

అక్కడ మీరు ఒకరినొకరు ద్రాక్ష తోటల్లో
వెతుక్కుంటూ, మట్టి కంపుకొట్టే బట్టలతో
ఇళ్ళు చేరుకునే వారు.

అవన్నీ ఇప్పుడప్పుడేజరిగే సంగతులు కావు.
మీ తాత - ముత్తాతలు భయంతో మిమ్మందర్నీ
చాలా దగ్గరగా, ఒకచోట పోగుచేశారు.
ఆ భయం, ఇంకా కొంత కాలం వరకు వుంటుంది.

మీ పొలాల నుంచి, మీ వంట పొయ్యిల్ని
పట్టణ ప్రాకారాలు కొన్నాళ్ళ వరకు వేరు చేస్తాయి.

ఆర్వెలీజు వాసులారా,
ఈ, మీ ఇళ్ళల్లో ఏముందో నాకు చెప్పండి?
తలుపులు మూసి మీరు దేన్ని భద్రంగా కాపాడుతున్నారు?
మీ శక్తిని వెల్లడించే, సత్సంకల్పంతో కూడిన శాంతి
మీకు వుందా? లేక, మనో కల్పనా శిఖరాల మధ్య
వలయా కారంగా వ్యాపించి,
మిణుకు - మిణుకు మనే పూర్వ స్మృతులు ఏమైనా
వున్నాయా?
మీ హృదయాలను కర్ర, రాతి వస్తువులపై మోజు నుంచి,
పవిత్ర పర్వత శిఖరానికి చేర్చే సౌందర్య పిపాస వుందా?
ఇవన్నీ మీ ఇళ్ళల్లో నాకు వున్నాయేమో చెప్పండి?
లేక, మీ ఇళ్ళల్లో వున్నది, ఒక్క సుఖలాలసేనా?
పచ్చ దొంగలాంటి సుఖా పేక్ష,
మీ ఇంట అతిథిగా ప్రవేశించి, క్రమంగా గృహాధిపతియై,
చివరికి మీ ఇంటి యజమానురాలౌతుంది.

ఆ సుఖలాలస క్రమంగా క్రూరమృగాల్ని అదుపు పెట్టే
దాని వలె తయారై, మితి మీరే మీ కోర్కెలకు
ఉచ్చువేసి, బిగించి, కొరడాతో బెదిరించి,
మిమ్మల్ని కీలుబొమ్మల్ని చేస్తుంది.

ఆ సుఖలాలస చేతులు పట్టులాగ మృదువుగా వున్నా,
దాని హృదయం ఇనుమువలె కఠినంగా వుంటుంది.
అది మీ శయ్య పక్కన నిలబడి, మిమ్మల్ని జోకొట్టి,
నిద్ర పుచ్చి, మీ అవయవాల ఆధిక్యత చూసి,
ఎగతాళి చేస్తుంది. పటుత్వం గల
మీ ఇంద్రియాల్ని చూసి, పరిహాసం చేస్తుంది.

పెళుసై విరిగి పోయే పాత్రల వలె,
మీ ఇంద్రియాల్ని విసిరి ముళ్ళ పొదల్లో పారేస్తుంది.
సుఖాపేక్ష, మీ ఆత్మశక్తిని హత్య చేసి,
దాని అంత్యక్రియల్లో పరిహాసంతో పాల్గొంటుంది.

కాని, మీరు - విశ్వావరణలో ఆవిర్భవించిన
శిశువుల వంటి మీరు - విరామ సమయంలో
కూడా అశాంతిగా వుండే మీరు—
మీరు మచ్చికా కావద్దు, బందీలూ కావద్దు,
మీ గృహం మీకు లంగరు కాకూడదు.
అది ఒక తెరచాప కొయ్యగా నిలవాలి.
గాయాన్ని కప్పే మెరపు పొరవలె కాక,
కంటిని కాపాడే రెప్పవలె వుండాలి, మీ గృహం
గుమ్మాల్లోంచి ఇంట్లోకి వెళ్ళేప్పుడు,
చేతులు ముడుచుకోవద్దు. ఇంటి కప్పుకు
తగులుతుందేమోనని మీరు తలలు వంచవద్దు.
గాలి పీలిస్తేనే, గోడలు బ్రద్దలైపోతాయేమోనని
భయపడవద్దు.
బ్రతికి వున్న వారి కోసం, చచ్చిన వారు కట్టించిన
గోరీలవంటి గృహాలలో మీరు నివసించవద్దు.

మీ గృహ మెంత దేదీప్య మానంగా వున్నా,
అది మీ నిగూఢత్వాన్ని దాచదు
మీ ఆశకు ఆశ్రయమివ్వదు.
మీలో అపారంగా వున్నదేదో అది—

ఆకాశ సౌధంలో నివసిస్తుంది.
దాని సింహద్వారం, ఉషఃకాలపు పొగమంచు.
దాని గవాక్షాలు, నిశాదేవి నిశ్శబ్ద గీతాలు.

*　　　*　　　*

# 9

"వస్త్రాలు అంటే ఏమిటి?" అని ఒక సాలె అతను అడిగాడు.
ఆయన జవాబు చెప్పారు:

మీ సౌందర్యంలోని చాలా భాగాన్ని, మీ బట్టలు కప్పేస్తాయి.
అయినా అవి అందవికారమైన వాటిని దాచలేవు.
మీరు ధరించే పట్టు బట్టల్లో స్వేచ్ఛ వుందేమోనని
మీరు వెదికి చూసుకున్నట్లయితే,
అందు కనుపించేవి జీను, కళ్ళెం మాత్రమే.
సూర్యకాంతిలో జీవన శ్వాస, గాలిలో జీవన హస్తం
వుంది కనుక, వీలైనంత ఎక్కువగా మీ ఒంటిని
బట్టలు కాక, ఎండ - గాలి తగిలేటట్లు చూడండి.

"మనం ధరించే బట్టల్ని ఉత్తర గాలులు నేస్తాయి," అని
మీలో కొందరు అంటారు. అవును, నేనూ అలాగే అంటాను
కాని, సిగ్గు ఆయన మగ్గం. శక్తిలోని సౌకుమార్యం, ఆయన నూలు
ఆయన తన నేత పని ముగించి, అరణ్యం చేరి నవ్వుతారు.

మలిన దృష్టికి "నమ్రత" ఒక డాలు వంటిదనే సంగతి
మరచిపోకండి.

మాలిన్యం ఏమాత్రం లేనప్పుడు, ఇంక "నమ్రత" అనేది ఏముంది?

అది కేవలం మనో కల్మషం, మనో బంధం మాత్రమే.
మీ నగ్న పాద స్పర్శ, పుడమి తల్లి కి పులకరింపనీ,
గాలి, మీ ముంగురులతో ఆడుకోవడానికి
ఆశ పడుతుందనీ మీరు మరచిపోకండి.

*     *     *

# 10

"కొనడం - అమ్మడం అంటే ఏమిటి?" అని
ఒక వర్తకుడు వారిని అడిగాడు.

జవాబుగా ఆయన ఇట్లా చెప్పారు:
భూమి తన ఫల సంపదను ఎప్పుడూ మీకు ఇస్తుంది.
మీ దోసిళ్ళను ఎట్లా నింపుకోవాలో మీకు తెలిస్తే,
ఇంక మీరు దేన్నీ కోరరు.
భూదేవి తన కానుకలను మీకు ఇవ్వడం,
మీరు వాటిని తీసుకోవడం - ఆ ఇచ్చి - పుచ్చుకోవడం
తో, మీకు అన్నీ విస్తారంగా లభిస్తాయి.
అప్పుడు మీరూ తృప్తిగా వుంటారు.

ఆ ఇచ్చి - పుచ్చుకోవడం ప్రేమతో - దయతో - న్యాయంగా
జరగకపోతే, అది కొందర్ని అత్యాశకీ, మిగిలిన వారిని
ఆకలి మంటల్లోకి లాక్కుపోతుంది.

సముద్రం మీద, పొలాల్లో, ద్రాక్ష తోటల్లో
కష్టపడి పనిచేసే మీరు, సంతకు వెడితే,
అక్కడ నేతగాళ్ళను - కుమ్మరి వాళ్ళను
పరిమళ ద్రవ్యాల్ని అమ్మే వాళ్ళను కలుసుకుంటే,
మీ తూకాల్ని - కొలతల్ని ధర్మంగా వుండేట్లు చూడమనీ,
మీ వస్తువుల పరస్పర విలువల్ని న్యాయంగా
పరిష్కరించమనీ, వాటికి సాక్షిగా మీ మధ్యకు
భూమినాథుని రమ్మని ఆహ్వానించండి.

ఆ వ్యవహారంలో పళారులు కలగజేసుకుంటే,
మీ కష్టార్జితాన్ని వారు తమ మాటలతో కొనాలని చూస్తే,
మీరు జాగ్రత్తపడి, వారితో ఇట్లా చెప్పండి:
భూమి - సముద్రం మా యెడల వాత్సల్యం చూపునట్లే,
మీ యెడలా చూపుతాయి కనుక,
మీరూ మాతో పొలాలకు రండి, లేదా—
మా సోదరులతో కలసి సముద్రం మీదికి వెళ్ళి
వలలు వేయండి.

ఆ సంతకే, గాయకులు - నాట్యం చేసేవారు—
మురళి వాయించేవారు వస్తే,
వారు తెచ్చినవి కూడా మీరు కొనండి.
ఎందుకంటే, వారూ పళ్ళూ - సాంబ్రాణి
పోగుజేసిన వారే.

వారు తెచ్చినవి కలల కళా రూపాలైనా,
అవి మీ ఆత్మకు పట్టు వస్త్రాలు - పంచ భక్ష్యాదులు.

సంత వదలి వెళ్ళే ముందు,
ఏ ఒక్కరూ రిక్త హస్తాలతో వెళ్ళకుండా చూడండి.
ఎందుకంటే, తనకు కావలసింది, పొంది తృప్తిపడే వరకు
అంతరిక్ష మందు విశ్వాత్మ విశ్రాంతిగా వుండదు.

*　　　　*　　　　*

# 11

నగర న్యాయాధికారుల్లో ఒకరు ముందుకు వచ్చి,
"నేరము - శిక్ష గురించి మాకు చెప్పండి," అని అడిగారు.
ఆల్ ముస్తఫా ఇట్లా చెప్పారు:

మీరు ఒంటరిగా, అజాగ్రత్తగా వుండి
అటూ - ఇటూ తిరుగుతున్నప్పుడు,
ఇతరుల యెడ పొరపాటు చేస్తారు.
అది స్వయం కృతా పరాధమే.
ఆ తప్పు చేయడం వలన, మీరు స్వర్గ ద్వారం ముందు
కొంతసేపు నిలబడి, వేచివుండి, ఎంత పిలిచి,
తలుపు తట్టినా, మిమ్మల్ని ఎవరూ లక్ష్యపెట్టరు.

మీలోని దైవాంశ సాగరం మాదిరిగా వుంది.
అది ఎప్పటికీ పవిత్రంగానే వుంటుంది.

ఆకాశం వలె, అది రెక్కలున్న వారిని పైకెత్తుతుంది.
మీలోని ఆ దైవాంశ, సూర్యుని మాదిరిగా కూడా వుంది.
దానికి చుంచెలుకల దారులు తెలియవు.
అది పాముల కన్నాలు వెదకదు.
కాని, మీలో వున్నది ఆ దైవాంశ ఒక్కటే కాదు.
మానవాంశ ఒకటి - మానవాంశ కానట్టిది మరొకటి
వుంది.
మానవాంశ కానట్టిది, రూపు రేఖా రహితమైన క్షుద్రత్వం.
అది నిద్రిస్తూ చలిస్తుంది. అది అలా నిద్రపోతూనే
తనను మేల్కొల్పేదాన్ని అన్వేషిస్తుంది.
నేరం, నేరం చేయడంవల్ల విధింపబడే శిక్ష—
అటు మీలోని దైవాంశకీ, ఇటు పొగ మంచులో
సంచరించే క్షుద్రత్వానికీ సంబంధించిన సంగతి కాదు.

అది మీలోని మానవాంశకు సంబంధించిన
విషయం.
నేను ఇప్పుడు మీలోని మానవాంశ గురించి
మాట్లాడతాను.

తప్పు చేసిన వాడు మీలో ఒకడు కానట్లూ,
అతడు మీకు అపరిచితుడైనట్లూ.
అతడు మీ పరిధిలోకి చొరబడి వచ్చినట్లూ
మీరు తరచు మాట్లాడుకోవడం నేను విన్నాను.
కాని, మీలో ఎంతటి పవిత్రాత్ముడైనా,
సత్యవ్రతుడైనా ప్రతివారిలో వెలుగుతున్న
ఆ దైవాంశ కన్నా అధికుడు కాడు.
అలాగే, దుర్మార్గుడు - దుర్బలుడు ఎవడైనాకానీ,

మీలో నీచాతి నీచమైన క్షుద్రత్వం కన్నా
కిందికి దిగజారలేదు.
వృక్షమంతా నిశ్చల - నిశ్శబ్ద జ్ఞానంలో నిలవనిది,
ఏ ఒక్క ఆకూ పండనట్లు, మీ అందరిలో
నిగూఢంగానైనా తప్పు చేయాలనే సంకల్పం
లేకపోతే, తప్పు చేసేవాడు, ఆ తప్పు చేయడు.
ఊరేగింపు మాదిరిగా మీరందరూ కలసి
దైవత్వం వేపు కదులుతారు.
బాట - బాట సారులూ మీరే!
పయనించే మీలో ఒకరు బాట మీద జారి పడితే,
"దారి మధ్య రాయి వుంది - జాగ్రత్త! - ప్రమాదం,"
అని, వెనక వచ్చే వారికి అది ఒక హెచ్చరిక.

జారి పడినవాని కంటే, ముందు వెళ్ళిన వారు
వడివడిగా, ధైర్యంగా, సమ్మకంగా నడచి వెళ్ళారే కాని,
దారిలో పడివున్నరాయిని తొలగించలేదు.
అందుచేత వెనక వెళ్ళిన వాడు, జారి పడ్డాడు.

మీ హృదయాల మీద బరువుగా పడినా,
ఈ నా మాటల్ని కూడా ఆలకించండి.
హతుడు, తన హత్యకు తానే జవాబు దారీ.
దోచుకోబడ్డవాడు, ఆ దోపిడీ విషయంలో
ఆతడే నిందితుడు.
దుర్మార్గుని దుష్ప్రవర్తనలో, సత్యవతుడు నిరపరాధి కాదు.
నేరస్థుడు చేసిన దుష్కార్యంలో, నీతివంతుడు
పరిశుద్ధుడు కాదు.
తప్పు చేసిన వాడు, తరచుగా,

బాగా గాయపడిన వానిచేత బాధకు గురిఅయిన వాడు.
ఇంకా చెప్పాలంటే, ఏ దోషమూ లేని,
ఏ తప్పు చేయని వారి కోసం
తరచు నిరసింపబడే వాడు, ఆ భారమంతా మోస్తాడు.
నలుపు - తెలుపు దారాలతో కలనేత నేసినట్లు
సజ్జనులు - దుర్జనులు అందరూ సూర్యుని ముందు
కలిసే తిరుగుతారు కనుక,
అన్యాయ పరుల నుంచి, న్యాయపరుల్నిగాని,
దోషుల నుంచి, నిర్దోషులనుగాని
మీరు వేరు చేయలేరు.
నేతలో ఓ నల్లపోగు తెగితే, నేతగాడు
పడుగు - పేకలతో పాటు మగ్గమంతా పరీక్షిస్తాడు.

ఎవరైనా తన భార్య అవిధేయురాలని
న్యాయ నిర్ణయం కోసం న్యాయాధిపతి దగ్గరకు
వెడితే, ఆమె శీలాన్ని ఏ రాళ్ళతో తూస్తారో,
వాటితోనే ఆమె భర్త హృదయాన్ని తుయ్యాలి.
ఆమెను కొలచిన కొలతబద్దతోనే,
న్యాయాధిపతి ఆమె భర్త ఆత్మనూ కొలవాలి.
నేరస్థుల్ని దండించేవాడు, నేరారోపణ చేసిన
వారి అంతరాత్మను కూడా శోధించాలి.
ధర్మం పేరుమీద ఎవరినైనా శిక్షించే ముందూ—
చెడ్డ చెట్టును గొడ్డలితో నరికే ముందూ—
వాటి మూలాల్ని కూడా అతను సాకల్యంగా
శోధించాలి.
మంచిచెట్ల వేళ్లు — చెడ్డచెట్ల వేళ్లు—
పళ్ళ నిచ్చే చెట్ల వేళ్ళు - పళ్ళు ఇవ్వని చెట్ల వేళ్ళు—

అన్ని భూ హృదయంలో మౌనంగా పెనవేసుకుని
వుండటం అతడు నిశ్చయంగా చూడగలడు.
సరైన న్యాయం చేకూర్చే న్యాయ మూర్తులుగా వుండండి.
శారీరకంగా నీతిగా వుండి, అంతర్యమందు
పచ్చి దొంగగా వున్నవానికి, మీరు ఏ తీర్పు ఇస్తారు?
ఒకడు, ఒకణ్ణి పొడిచి చంపాడంటే,
హంతకుడు, తన ఆత్మను తాను
హత్య చేసుకున్నాడన్నమాటే!
అటువంటి ఆత్మాంతకునికి, మీరు ఏ దండన విధిస్తారు?
ఒకడు చేసే పనుల్లో, మోసం - హింస వున్నదంటే,
అతడు కూడా అప్పటి వరకూ నష్టపడ్డ వాడూ,
అవమాన పడ్డవాడూ, దౌర్జన్యానికి
గురైన వాడే కదా?
అటువంటి అతని మీద మీరు
ఏ నేరం మోపుతారు?

తాను చేసిన దుష్కార్యాల కన్నా
ఎక్కువ పశ్చాత్తాప్పడ్డ వానిని,
మీరు ఏ విధంగా శిక్షిస్తారు?
ఏ న్యాయం పాటించాలని మీరు
సంతోషంతో యత్నిస్తారో, ఆ న్యాయమే
దోషిని పశ్చాత్తాపాగ్నిలో కాలుస్తుంది.
నిర్దోషుల్ని పశ్చాత్తాప్ప డేటట్లు మీరు చేయలేరు.
దోషి హృదయం నుంచి, పశ్చాత్తాపాగ్నిని
తొలగించలేరు.
మనుష్యులు నిద్రమేల్కొని, ఆత్మ విమర్శ

చేసుకునేప్పుడు, సహజంగా పశ్చాత్తాప్పడతారు.
న్యాయాన్ని తెలుసుకోగలిగిన వారు,
అన్ని అంశాల్ని వెలుగులో చూడనిది
న్యాయాన్ని ఎట్లా చేకూర్చగలరు?
నిర్మాణం - పతనం, రెండూ ఒకటే.
"క్షుద్రత్వం" అనే రాత్రికీ,
"తేజోవంతమైన దైవాంశ" అనే పగటి వేళకి
మధ్య - సంధ్య వెలుగులో నిలబడ్డ మానవులం, మనం."
అని మీరు అప్పుడు తెలుసుకుంటారు.

గుడి పునాది రాయి కన్నా,
మూర్తిగా మలచిన మూల స్థానం రాయి,
గొప్పది కాదు.

* * *

# 12

"ధర్మం అంటే ఏమిటి?" అని ఒక న్యాయవాది అడిగాడు.
ఆయన జవాబు చెప్పారు:
పిల్లలు సముద్రం ఒడ్డున చేరి ప్రేమతో
పిచ్చుక గూళ్ళు కట్టి, తర్వాత నవ్వుతూ
వాటిని నేల కూల్చినట్లు,
ధర్మ నిర్ణయం చేయడంలో మీరు ఎంతో
సంతోషం చూపుతారు.

వాటిని ఉల్లంఘించడంలో కూడా మరింత
ఉత్సాహాన్ని చూపుతారు.
కాని, పిల్లలు పిచ్చుక గూళ్ళు కడుతోవుంటే,
సముద్రం మరింత ఇసుక తెచ్చి ఒడ్డున పోస్తుంది.
తాము కట్టిన పిచ్చుక గూళ్ళను
తామే నాశనం చేసేప్పుడు
సముద్రం వారితో కలిసి వినోదిస్తుంది.
అమాయకులతో కలసి సముద్రం ఎప్పుడూ నవ్వుతుంది.

జీవితాన్ని ఒక మహాసాగరంగా భావించక,
మానవ నిర్మిత ధర్మాల్ని పిచ్చుక గూళ్ళు అనుకోక,
జీవితాన్ని కేవలం ఒక కఠిన శిలగా భావించి,
దాన్ని తమ ఇష్టం వచ్చినట్లు చెక్కుకునేందుకు
ధర్మాన్ని ఒక ఉలిగా ఉపయోగించుకునే
వారి సంగతి ఏమిటి?
నాట్యం చేసే వారిని ద్వేషించే, కుంటివాళ్ళ సంగతి ఏమిటి?
తన మెడ మీద భారంగా వున్న కాడిని ప్రేమిస్తో,
అరణ్యంలో స్వేచ్ఛాగా తిరిగే కణుజుల్ని - లేళ్ళనీ
విశృంఖలంగా తిరుగుతున్నాయని నిందించే
వృష భంగతి ఏమిటి?
తన కుబుసం జార విడుచుకోలేక,
తక్కిన సర్పాలన్నీ సిగ్గు విడిచి నగ్నంగా
తిరుగుతున్నాయనే ముసలి సర్పం సంగతి ఏమిటి?
వివాహ భోజనానికి ముందుగా హాజరై
అతిగా తిని, భుక్తాయాసంతో తన దారిని పోతూ,
"విందులు మితాహార శాసనోల్లంఘనాలనీ,

విందులు ఆరగించు వారంతా చట్టాన్ని అతిక్రమించేవారనీ"
అనే వారిని మీరు ఏమనగలరు?

వాళ్ళంతా ఎండలో నిలబడి, సూర్యుని వేపు వీపు తిప్పి
వున్నారని తప్ప, ఇంక నేను ఏమనగలను?
వారు కేవలం తమ నీడల్నే చూస్తారు.
వారి నీడలే, వారి ధర్మాలు.
సూర్యుడంటే వారికి కేవలం నీడల్ని ఏర్పరచే వాడని అర్థం.
ధర్మాల్ని పాటించడమంటే, ఎండలో నిలబడి,
నేల మీదికి వంగి, భూమి మీద తమ నీడల్ని గుర్తించడమా?
కాని, సూర్యుడికి అభిముఖంగా నడిచే మిమ్మల్ని
భూమి మీద పడ్డ ఏ నీడలు అడ్డగిస్తాయి?
గాలి వాలును బట్టి ప్రయాణం చేసే మిమ్మల్ని,
ఏ దిక్సూచి ఆజ్ఞాపించ గలదు?
మీ భుజం మీది కాడినే గాని,
మరెవరి కారాగృహం తలుపు విరగ గొట్టకపోతే,
ఏ మానవ శాసనం మిమ్మల్ని బంధించగలదు?

మీరు నాట్యం చేస్తూ, మరొకరి ఇనుప సంకెళ్ళ మీద
తూలి పడకపోతే, మీరు ఏ శాసనాలకు
భయపడాలి?
మీరు మీ బట్టల్ని చింపి, పారేస్తే,
అవి మరొకరి దారికి అడ్డు కాకపోతే,
మిమ్మల్ని న్యాయ స్థానానికి ఈడ్చే వాడెవడు?

ఆర్ఫలీజు వాసులారా,
మీరు భేరీలకు ముసుగులు వేయగలరు.

వీళ్ళు తీగల్ని వదులు చేయగలరు.
కాని, భరద్వాజ పక్షి పాడకుండా ఎవరు ఆజ్ఞాపించగలరు?

* * *

# 13

"స్వేచ్ఛ అంటే ఏమిటి?" అని ఒక వక్త ఆయన్ని అడిగాడు.
ఆయన జవాబు చెప్పారు:

నిరంకుశ ప్రభువు ఒక పక్క తలలు నరికిస్తూ వుంటే,
అతని ముందు బానిసల వలె తలలు వంచి,
స్తుతించే వారి వలె కోట గుమ్మం వద్దా—
ఇంట్లో చలి కుంపటి పక్కనా—
మీకు మీరు సాష్టాంగ పడి,
మీ స్వేచ్ఛను మీరు ఆరాధించడం నేను చూశాను.

మీలోని స్వేచ్ఛా పరుడు దేవాలయ వనాల్లో,
కోట గోడల నీడల్లో, తన స్వేచ్ఛను
మెడ మీది కాడివలె, చేతి సంకెళ్ళ వలె ధరించడం
నేను చూశాను.
అది చూసి నా హృదయం రక్తం కార్చింది.
స్వేచ్ఛను వెదకడం కూడా ఒక బంధమని
మీరు తెలుసుకున్నప్పుడు, మీకు స్వేచ్ఛ వుంటుంది.
స్వేచ్ఛను ఒక లక్ష్యంగా ఎంచి, దాన్ని పొందినట్లు
మాట్లాడటం మానేసినప్పుడూ, మీకు స్వేచ్ఛ వుంటుంది.

పగటి వేళల్లో మీరు ఏ జాగ్రత్తలూ పడనప్పుడూ,
ఎటువంటి ఆందోళనలూ చెందనప్పుడు—
రాత్రులు ఎటువంటి కోర్కెలూ - దుఃఖాలు లేనప్పుడు—
అప్పుడు మాత్రమే మీరు నిశ్చయంగా స్వేచ్ఛగా వుండగలరు.
అవన్నీ ఒకవేళ మీ జీవితంలో తారసిల్లితే,
మీరు నిర్ద్వంద్వస్థితిలో, సహజ స్వభావంతో
అతీతులుగా వుంటారు.

మీకు విషయ పరిజ్ఞానం కలిగిన క్షణంలో,
మీకు మీరు స్వయంగా బిగించుకున్న గొలుసుల్ని
మీకు మీరు తెంచుకోకపోతే,
మీరెట్లా కాలాతీత వ్యక్తులు కాగలరు?
నిజం చెప్పాలంటే, సూర్యకాంతిలో మెరుస్తూ,
కళ్ళకు విభ్రమాన్ని కలిగిస్తున్న ఆ గొలుసులోని
"స్వేచ్ఛ" అనే కొక్కెం మరింత బలమైనది.

మీ వ్యక్తిగత అంశాల్లోని కొన్నింటిని
నిరాకరించినంత మాత్రాన, మీరెట్లా స్వేచ్ఛగా
వుండగలరు?
"అది అధర్మం. దాన్ని రద్దు చేయాలి" అని మీరు
అనుకుంటే, ఆ అధర్మం ఎదో కాదు,
అది, ఒకనాడు మీరు మీ చేతులారా
మీ నుదుటి మీద రాసుకున్నదే!

న్యాయ శాస్త్ర గ్రంథాలన్నింటినీ తగల బెట్టినా,
సముద్ర జలాలన్నీ పోసి కడిగినా,
ధర్మ నిర్ణేతల నొసటి రాతల్ని తుడిచెయ్యలేరు.

నియంతను, రాజ్యభ్రష్టుణ్ణి చేయాలంటే,
అతని కోసం మీలో స్థాపించుకున్న
ఆ సింహాసనాన్ని కూలతోయాలి.

తమ స్వేచ్ఛలోని నిరంకుశత్వాన్ని,
తమ అహంభావంలోని అవమానాన్ని,
నిరంకుశ ప్రభువు పాలించగలడు కాని,
స్వేచ్ఛా పరుణ్ణి, అభిమానవంతుణ్ణి ఎట్లా పాలించగలడు?
స్వేచ్ఛ పొందాలనుకుంటే,
అది ఎటువంటి ఆందోళనైనా - తోసెయ్యగలరు.
కాని, ఏ ఆందోళన అయినా దాన్ని మీకు మీరు
తెచ్చి పెట్టుకున్నదే కాని, ఇతరులెవరూ దాన్ని
మీ పై రుద్దింది కాదు.

ఎటువంటి భయాన్నైనా మీరు తోసెయ్యాలనుకుంటే,
ఆ భయం యొక్క ఆసనం మీ హృదయంలోనే వుంది కాని,
భయపెట్టే వాని చేతిలో లేదు.

మీరు, వాంఛించేవి - భయపడేవి - అసహ్యించు
కునేవి - మీ వెంటపడేవి - మీరు పారిపోజూసేవి—
అన్ని మీలో మిమ్మల్ని విడవకుండా
అర్ధాలింగనంలో మీలో చలిస్తూ వుంటాయి.
అవన్ని మిమ్మల్ని ద్వంద్వాలుగా అంటిపెట్టుకుని
మీలో వెలుగు - నీడలుగా, జతలుగా మెదులుతూ
వుంటాయి.

నీడ కూడా పాలిపోయి, ఇంకేమీ మిగలనప్పుడు—,
వీడని కాంతి, క్రమంగా మరో కాంతికి నీడగా మారుతుంది.

అలాగే- మీ స్వేచ్ఛ, తన సంకెళ్ళను సడలించుకున్నప్పుడు,
అది తనకు తాను మరో మహోన్నత స్వేచ్ఛకు కట్టుబడివుంటుంది.

* * *

# 14

"వివేకం, మోహం గురించి మాకు చెప్పండి," అని
ఆ పూజారిణి మళ్ళా అడిగింది,
జవాబుగా ఆయన ఇట్లా చెప్పారు:
మీ మోహావేశానికి, మీ తృష్ణకు వ్యతిరేకంగా—
మీ వివేకం, మీ న్యాయ నిర్ణయం
యుద్ధం చేయడం వల్ల, తరచు మీ ఆంతర్యం
రణ రంగంగా మారుతూ వుంటుంది.
మీ ఆత్మ క్షేత్రంలో నేను శాంతి స్థాపకుడనైతే,
మీ విరోధాన్ని, మీ మూలతత్వాల ఘర్షణనీ
నివారించి, వాటిని ఏకం చేసి, మధురంగా మార్చేవాడిని.
కాని, మీరు కూడా శాంతి స్థాపకులూ,
మీ మూల త్వతాలకు ప్రేమికులూ కాకపోతే,
నేను మీ ఆత్మ క్షేత్రంలో ఎట్లా శాంతి స్థాపించగలను?

జీవన సాగరంలో పయనించే మీ ఆత్మ నౌకకు,
వివేకం చుక్కాని, మోహావేశం తెరచాప.
చుక్కాని గాని, తెరచాపగాని చెడిపోతే,
మీరు కలవర పడతారు - లేదా, ఎట్లైనా

కొట్టుకుపోతారు - కాకపోతే, సముద్రంలో
ఒకచోట కదలకుండా నిలిచిపోతారు.

వివేకం ఒక్కటే, పాలించేది అయితే,
అది, నిర్బంధించే శక్తి అవుతుంది.
తోడులేని మోహావేశం, జ్వాలై,
అది, తన నాశనానికి తానే హేతువు అవుతుంది.

తాను హాయిగా పాడుకునేందుకు
మీ మోహావేశపు ఎత్తుకు, మీ వివేకాన్ని కూడా
పైకెత్తనీయండి, మీ ఆత్మను.
తన చితి నుంచి పైకి లేచే "ఫినిక్స్" మాదిరిగా,
మీ మోహావేశం, తన పునర్జన్మతో జీవించేందుకు
మీ ఆత్మను, వివేకంతో కలిసి నడవనివ్వండి.

మీ తృష్ణనూ, మీ న్యాయ నిర్ణయాన్నీ
మీ ఇంట ప్రేమాస్పదులైన ఇద్దరు అతిథులుగా
భావించండి. ఆ ఇద్దరి మధ్య మీరు తర - తమ
భేదాలు చూపకండి. చూపారా,
మీరు ఆ ఇద్దరి విశ్వాసానికి దూరమౌతారు.

కొండల మధ్య నున్న పొలాల, పచ్చిక మైదానాల
ప్రశాంతతనూ, నిర్మలత్వాన్నీ పంచుకుంటూ
తెల్ల బూరుగు చెట్ల చల్లని నీడల్లో
మీరు కూర్చున్నప్పుడు,
"ఈశ్వరుడు వివేకంలో విశ్రమిస్తున్నాడు," అని
మీ హృదయాన్ని మౌనంగా తలచుకోనివ్వండి.
బ్రహ్మాండమైన గాలి విసుర్లతో తుఫాను వచ్చి,

మహారణ్యాల్ని ఊపేస్తున్నప్పుడూ,
మెరుపులు, పిడుగులు ఆకాశ ప్రభావాన్ని
ప్రకటిస్తున్నప్పుడూ,
"ఈశ్వరుడు మోహావేశంలో తాండవిస్తున్నారు," అని
భయ - భక్తులతో మీ హృదయాన్ని తలచుకోనివ్వండి.

ఈశ్వరావరణలో ఒక శ్వాసగా,
ఆయన మహారణ్యంలో ఒక పత్రంగా వున్న మీరు కూడా,
వివేకంలో వర్తించి, మోహావేశంలో వర్తించాలి.

* * *

# 15

"వేదన అంటే ఏమిటి?" అని ఒకామె వారిని అడిగింది.
ఆయన చెప్పారు:

మీ జ్ఞానాన్ని మూసిన గట్టిపెంకు
బద్దలు కావడమే, వేదన.
ఫల హృదయం సూర్యకాంతిలో ప్రకాశించాలంటే,
పండు పైనున్న రాయిలాంటి గట్టిపెంకు బద్దలు కావాలి.
అలాగే, మీరు మీ వేదనను తెలుసుకోవాలి.
మీ నిత్య జీవితానుభవాలకు, మీ హృదయం
ఆశ్చర్యపడితే, మీ సంతోషం కన్నా, మీ వేదన
తక్కువ ఆశ్చర్యకరమైనది కాదని మీరు తెలుకో
గలరు.

మీ పొలాల పైనుంచి వీచే ఋతు సమీరాల్ని,
మీరు ఎప్పుడూ అంగీకరించినట్లే,
మీ హృదయ సహజ పరివర్తనల్ని కూడా
మీరు అంగీకరిస్తారు.
దుఃఖానుభవం ద్వారా, మీరు మీ శాంతాన్ని గమనించండి.

చాలా వరకు మీరు కోరి తెచ్చుకున్నదే, మీ వేదన.
మీ ఆత్మరుగ్మతను నయం చేయడానికి,
మీలోని వైద్యుడు ఇచ్చే చేదు మందే, వేదన.
ఆ వైద్యుణ్ణి విశ్వసించి, ఆయన ఇచ్చే చేదు మందు
మాట్లాడకుండా, నిదానంగా తాగండి.
ఆ భవరోగ వైద్యుని హస్తం బరువుగా, మొరటుగా వున్నా,
దాన్ని కూడా సుకుమారమైన ఒక అదృశ్య హస్తం
నడుపుతోంది.

ఆయన ఇచ్చిన ఔషధ పాత్ర, మీ పెదవుల్ని
మండించినా సరే, తాగండి. ఎందుకంటే,
ఆ పాత్ర తయారు చేయడానికి సృష్టి కర్త
తన పవిత్రాశ్రువులతో ఆ మట్టిని తడిపాడు.

* * *

# 16

"ఆత్మ జ్ఞానం గురించి మాకు చెప్పండి," అని
ఒకాయన అడిగాడు.

సమాధానంగా ఆయన ఇట్లా చెప్పారు:

సృష్టి రహస్యాల్ని మీ హృదయాలు
నిశ్చలత్వంలో తెలుసుకుంటాయి.
కాని, మీ ఆత్మ విద్యా ప్రావీణ్యతను వినడానికి,
మీ వీనులు ఆర్తితో తహ తహలాడతాయి.
మీ స్వప్న - నగ్న - దేహాన్ని మీ చేతులతో
మీరు తాకవచ్చు.
మీరు ఎప్పుడూ తలంపుల్లో తెలుసుకునేదాన్నే,
మాటల్లో తెలుసుకుంటారు.

మీరు అలా చేయడం బాగానే వుంటుంది.
మీ ఆంతర్యంలో మరుగు పడివున్న మంచి జల
పెల్లుబికి ఆడుతూ - పాడుతూ - పరుగిడుతూ
సముద్ర గర్భం చేరాలనుకుంటుంది.
అప్పుడు - అంతులేని మీ అగాధ ఆంతరంగిక ఐశ్వర్యం
మీ కళ్ళ ముందు సాక్షాత్కరిస్తుంది.
కాని, మీ అవ్యక్తనిధిని తూచేందుకు వీలులేదు కనుక,
యత్నించకండి.
ఆత్మ, అపరిమితమైన సముద్రం వంటిది గనుక,

మీ జ్ఞానోన్నతిని ఏ శ్రద్ధతో గాని, మరి దేనితో గాని
కొలవడానికి చూడకండి.

"నేను సత్యాన్ని కనుక్కున్నాను," అని అనడం కన్నా,
"నేనో సత్యాన్ని కనుక్కున్నాను, అని అనడం నయం.
"నేను ఆత్మమార్గాన్ని కనుక్కున్నాను," అని అనడంకన్నా,
నా మార్గాన నడుస్తున్న ఆత్మను కలుసుకున్నాను," అని
అనడం నయం.
ఆత్మ అన్ని మార్గాల చరిస్తుంది.
అది ఒకే బాట మీద నిలిచి నడవదు.
అది వెదురు గొట్టం వలె నిటారుగా ఎదగదు.
బహు పత్ర పద్మం వలె,
ఆత్మ, దానికదే వికసిస్తుంది.

* * *

# 17

"ఉపదేశం" అంటే ఏమిటి?" అని ఒక ఆచార్యుడు అడిగాడు,
సమాధానంగా ఆయన ఇట్లా చెప్పారు:
మీ జ్ఞానోదయం వేళ—
అప్పటి వరకు సగం నిద్రలో, సందిగ్ధంలో వున్నదాన్ని తప్ప,
ఇంక దేనినీ, ఎవరూ మీకు వ్యక్తి పరచలేరు.
తన అనుచరులతో కలసి దేవాలయ నీడల్లో
తిరుగుతున్న గురువు, తన విశ్వాసాన్ని - ప్రేమను

శిష్యులకు ఇవ్వగలడేమో కాని,
తన జ్ఞానాన్ని మాత్రం ఇవ్వలేడు.
అతడు నిశ్చయంగా వివేకవంతుడైన గురువైతే,
వారిని తన జ్ఞాన మందిరంలో ప్రవేశించమని
ఆజ్ఞాపించాడు. కాని, వారిని వారి మానసిక
ప్రాంగణం వరకు నడిపించుకుని పోతాడు.

ఖగోళ శాస్త్రజ్ఞుడు తనకు తెలిసిన అంతరిక్ష జ్ఞానం గురించి
మీతో మాట్లాడగలడు కాని,
తన అవగాహనను మీకు ఇవ్వలేడు.

విశ్వమంతా లయబద్ధంగా వ్యాపించి వున్న నాదాన్ని,
గొప్ప గాయకుడు మీకు పాడి వినిపించగలడు కాని,
ఆ పాటను మీలో ప్రతిధ్వనింప చేయలేడు.

లయబద్ధమైన సంగీత జ్ఞానాన్ని నిలుపుకోగల
చెవిని కూడా మీకు ఇవ్వలేడు.

గణితశాస్త్ర ప్రవీణుడు తూకాల, కొలతల గురించి
చెప్పగలడు కాని, వాటి అసలు విలువల దగ్గరకు
మిమ్మల్ని తీసుకుపోలేడు. ఎందుకంటే,
మనిషి తన దివ్య దృష్టిని మరొకరికి ఎరువుగా ఇవ్వలేడు.

ఈశ్వరతత్వం విషయంలో ప్రతి ఒక్కరూ
తమ తమ అభిప్రాయాలతో వున్నట్లే,
ఐహిక- ఆముష్మిక విషయ జ్ఞానంలో కూడా
ఎవరి ఎరుకవారిదే!

* * *

# 18

“మిత్రత్వం అంటే ఏమిటి?” ఒక యువకుడు
అడిగాడు.
సమాధానంగా ఆయన ఇట్లా చెప్పారు:

మీ అవసరాలకు మిమ్మల్ని ఆదుకునేవాడే,
మీ మిత్రుడు.
ప్రేమతో విత్తనాలు చల్లుకోవడానికీ,
కృతజ్ఞతతో పంట కోసుకోవడానికి
మీ పొలం వంటి వాడు, మీ మిత్రుడు.
మీరు ఆకలితో అతన్ని సమీపిస్తారు.
శాంతి కోసం అతన్ని అన్వేషిస్తారు - కనుక,
అతడు మీ అన్నదాత, మీకు ఓదార్పు ఇచ్చేవాడు.

మీ మిత్రుడు మీతో మనసు విప్పి మాట్లాడినప్పుడు,
మీరు మీ మనసులో కూడా “కాదు” అనడానికి
భయపడవద్దు - అలాగే, “అవును” అనడానికి కూడా
వెనుకాడవద్దు.

మైత్రిలో అన్ని ఆలోచనలు - అన్ని కోర్కెలు—
అన్ని నిరీక్షణలు - ఉద్భవించిన క్షణాన్నే
ఏ ప్రకటనా చేయకుండా—
మాటల అవసరంలేకుండా సంతోషంగా
ఒకరి కొకరికి అవగత మౌతాయి.

మీ మిత్రుడు మౌనంగా వున్నప్పుడు,
అతని హృదయం ఏం చెపుతుందో,
మీ హృదయం వినకుండా వూరుకోదు.

స్నేహితుని నుంచి మీరు విడిపోయినప్పుడు,
మీరు విచారించవద్దు.
నేల మీద నుంచి పర్వత శిఖరం చూసిన
ఆరోహకునికి పర్వత మంతా స్పష్టంగా కనుపిస్తుంది.
అలాగే, మిత్రునిలో గొప్పగా ప్రేమించిన గుణం,
అతని పరోక్షంలో కూడా స్పష్టంగా తెలుస్తుంది.
ఆత్మల ఐక్యం తప్ప, మిత్రత్వంలో
మరో ఉద్దేశ్యం వుండకూడదు.
తన రహస్యాల్ని బైట పెట్టుకోవడానికే
ప్రయత్నించాలి గాని, మరి దేనిని అన్వేషించినా
ఆ ప్రేమ, కేవలం విసరిన వల పాత్రమే అవుతుంది.
అంతేకాని, అది ప్రేమ మాత్రం కాదు.
అందు అల్పమైనవే లభ్యమౌతాయి.

మీ మంచి, మీ మిత్రునికి ఉపయోగపడుగాక!
మీ జీవన ప్రవాహపు ఆటును
మీ మిత్రుడు తెలుసుకొనగలిగితే,
ఆ ప్రవాహపు వరదను కూడా, అతన్ని గ్రహించనివ్వండి.
స్నేహం, కాలక్షేపం కోసం కాదు;
క్షణ క్షణం జీవించడానికి.

మిత్రుడంటే, మీ అవసరాలను తీర్చేవాడే కాని,
మీ ఆంతరంగిక శూన్యాన్ని నింపే వాడు కాదు.

అల్ప వస్తువుల మీది మంచు బిందువులలో
హృదయం తన ప్రభాతాన్ని కనుక్కొని,
సేదదీర్చుకుంటుంది.

స్నేహ మాధుర్యంలో, నవ్వులు పండాలి.
సంతోషాలు పంచుకోవాలి.

*　　　*　　　*

# 19

"ప్రసంగం అంటే ఏమిటి?" అని ఒక పండితుడు అడిగాడు.
సమాధానంగా ఆయన ఇట్లా చెప్పారు:

మీ ఆలోచనతో మీరు శాంతంగా లేనప్పుడు,
మాటల్లోకి దిగుతారు.
మీరు మీ హృదయపు ఏకాంతమందు
ఒంటరిగా ఎక్కువ సేపు నిలవలేనప్పుడు,
మీరు మీ పెదవుల్లో నివసిస్తారు.
శబ్దమంటే, మీకొక వేడుక, వినోదం.
మాటల పంజరంలో తన రెక్కల్ని ఆడిస్తుందే కాని,
ఆకాశ విహంగం మాదిరిగా ఆలోచన ఎగిరిపోలేదు.
అధిక ప్రసంగాల్లో ఆలోచన, సగ భాగం చచ్చిపోతుంది.
ఒంటరితనానికి భయపడి, మీలో కొందరు
వదరు బోతుల్ని వెతుక్కుంటారు.

ఒంటరితనం యొక్క నిశ్శబ్దం, తమ సహజత్వాన్ని
కళ్ళకు కడుతుంది. తమ సహజత్వాన్ని తామే భరించలేక,
దాన్నించి తప్పించుకుంటారు.

కొందరున్నారు, వారు అజ్ఞానం వల్లనో,
ముందుచూపు లేకనో, తాము ఏ మాత్రం
అర్థం చేసుకోలేని - తమకు ఏ మాత్రం తెలియని
పరమ సత్యాన్ని మాటల్లో వెల్లడిస్తారు.
కొందరిలో సత్యం వుంది. కాని, వారు దాన్ని
మాటల్లో వ్యక్త పరచలేరు.
అటువంటి వారి హృదయంలో,
విశ్వాత్మ లయబద్ధంగా జీవిస్తుంది.

దారిలో గాని, బజారులోగాని
మీరు మీ మిత్రుణ్ణి కలుసుకుంటే,
మీ అంతరాత్మ మీ పెదవుల్ని కదిపి,
మీ నాలుకను ఆజ్ఞాపించనివ్వండి.

ఎప్పుడో తాగిన ద్రాక్ష సారాయి రుచి, రంగు మరచినా,
ఆ పాత్ర పగిలి, ఏమీ మిగలకుండా పోయినా,
గతంలో తాగిన ఆ ద్రాక్ష సారాయి రుచి
జ్ఞాపకమున్నట్లు; మీ హృదయ సత్యాన్ని,
మీ మిత్రుని ఆత్మ భద్రపరచుకుంటుంది.
మీ మిత్రుని అసలు శ్రవణేంద్రియంతో,
మీ అంతర్వాణిని సంభాషించ నివ్వండి.

*   *   *

# 20

"గురువర్యా, కాలమంటే ఏమిటి?" అని ఒక
ఖగోళ శాస్త్రజ్ఞుడు వారిని అడిగాడు.
ఆయన సమాధానం చెప్పారు:

అనంతం - అసాధ్యం అయిన కాలాన్ని మీరు కొలుస్తారు.
మీ ప్రవర్తననూ, చివరికి మీ ఆత్మ స్థితిని
ఆజ్ఞాపించే దాన్ని సహితం మీరు
గంటల - ఋతువుల ప్రకారం నడిపిస్తారు.
కాలాన్నొక ప్రవాహంగా భావించి,
దాని గట్టున కూర్చుని, దాని గమనాన్ని గమనిస్తారు.

అయినప్పటికీ మీలోని కాలాతీత సత్యం,
జీవిత వాస్తవికతకు ఎరుకలో వుంది.
"నిన్న" అంటే, నేటి "స్మృతి." రేపు అంటే, "నేటి స్వప్నం"
అని, మీలోని కాలాతీత సత్యానికి తెలుసు.
మీలో నిరంతరం పాడుతూ, యోచిస్తో వుండే
ఆ కాలాతీత సత్యం, ఆకాశంలో నక్షత్రాల్ని
వెదజల్లిన మొదటి క్షణం నుంచీ
ఇప్పటి వరకూ గల వ్యవధి అంతటా వ్యాపించి వుంది.
ప్రేమించే శక్తి అపారమైనదని
మీలో ఎవరూ అనుకోవడం లేదా?
అయినప్పటికీ అపారమైనదీ,

తన వ్యక్తిత్వపు వలయ కేంద్రంలో పరివేష్టించి వున్నదీ,—
ఒక ప్రేమ భావంనుంచి, మరొక ప్రేమ భావానికి
కదలనిదీ, — ఒక ప్రేమ కలాపం నుంచి
మరో ప్రేమ కలాపానికి తిరగనిదీ అయిన
ఆ ప్రేమను మీలో ఎవరు అనుభవించకుండా వున్నారు?
ప్రేమ మాదిరిగా కాలం, అఖండంగా, అవిభక్తంగా లేదా?

కాని, మీరు మీ ఆలోచనల్లో
కాలాన్ని ఋతువుల్లో కొలిచినా, ప్రతి ఋతువునూ
మిగిలిన ఋతువులు పరివేష్టించనివ్వండి.
గతాన్ని వర్తమానం జ్ఞాపకంతో కావిలించుకోనివ్వండి.
భవిష్యత్తును వర్తమానం ఆశతో హత్తుకోనివ్వండి.

* * *

# 21

"మంచి - చెడ్డల గురించి మాకు చెప్పండి," అని
పుర పెద్దలలో ఒకరు ఆయన్ని అడిగారు.
ఆయన చెప్పారు:

తన ఆకలి - దప్పికలతో "మంచి" పడే
చిత్రహింసే "చెడు."
మీలోని మంచితనం గురించి నేను మాట్లాడగలను.
కాని, మీలోని చెడు గురించి నేను మాట్లాడలేను.

నిజం చెప్పాలంటే, మంచితనం ఆకలితో వున్నప్పుడు,
చీకటి గుహల్లో సైతం తన ఆహారాన్ని
వెతుక్కుంటుంది. దప్పికతో వున్నప్పుడు,
మురుగెత్తిన నీటిని సైతం తాగుతుంది.

మీతో మీరు త్రికరణ శుద్ధిగా ఏకీభవించినప్పుడు,
మీరు మంచివారు.
మీతో మీరు ఏకీభవించనంత మాత్రాన చెడ్డవారు కాదు.
విభాగమైన గృహం, దొంగల గుహ కాదు.
అది కేవలం విభక్త కుటుంబం మాత్రమే!
చుక్కాని లేని నావ, నడి సముద్రంలో
ప్రమాదకరమైన ద్వీపాల్లో లక్ష్యం లేకుండా
అటూ - ఇటూ తిరగవచ్చు—
కాని, అది అడుక్కి మునిగిపోదు.

మిమ్మల్ని మీరు అర్పించుకునేందుకు
మీరు గట్టిగా పెనుగులాడినప్పుడు,
మీరు మంచివారు. స్వలాభం కోసం మీరు
ప్రాకులాడినంత మాత్రాన మీరు చెడ్డవారు కాదు.
స్వలాభం కోసం శ్రమ పడుతున్నప్పుడు,
మీ ప్రవర్తన ఎట్లా వుంటుందంటే,
భూమికి గట్టిగా అతుక్కుని, భూమాత రొమ్ము
గట్టిగా పీల్చే చెట్టు వేరు వలె వుంటుంది.
పండు ఎప్పుడూ రూఢిగా వేరుతో అనదు—
"నువ్వు నావలె పండి, తరగని నీ మాధుర్యాన్ని
ఎప్పుడూ అందిస్తూ వుండు," అని.

వేరుకి స్వీకరించడం ఎలాగో,
ఫలానికి సమర్పించడం, దాని ఆవశ్యకత.

మీరు మాట్లాడే దానికి మీరు పూర్తి ఎరుకలో వుంటే,
మీరు మంచివారు.
ఉద్దేశ్యరహితంగా నిద్రలో మీ నాలుక తడబడినా,
మీరు చెడ్డవారుకాదు. తొట్రుపడుతూ మాట్లాడినా
దుర్బలమైన నాలుకకు అది బలాన్ని ఇస్తుంది.

మీరు దృఢంగా, నిర్భయంగా లక్ష్యం వేపు
పురోగమించినప్పుడు, మీరు మంచివారు.
లక్ష్యం వేపు కుంటుకుంటూ వెళ్ళినా, మీరు చెడ్డవారు కాదు.
కుంటుతో నడిచే వారు కూడా, వెనక్కి పోరు.

కాని, బలాఢ్యులు - త్వరిత గమనులూ
అయిన మీరు, అవిటి వాళ్ళ ముందు కుంటుతో,
కాళ్ళు ఈడ్చుతో నడవకండి, అదేదో దయగా ఎంచి!

మీరు అనేక విధాల మంచివారు.
మీరు మంచిగా లేనప్పుడు, చెడ్డవారు కాదు.
మీరు కేవలం, కాల విలంబన చేసే వారు—
సోమరులు మాత్రమే!

లేడి, తాబేలుకు వేగంగా పరిగెత్తడం
నేర్పలేక పోవడం, శోచనీయం.

విరాట్ స్వరూపాన్ని దర్శించేందుకు
మీరు పడే తహ తహలో, మీ మంచితనం వుంది.

ఆ తహ తహ మీ అందరిలోనూ వుంది. కాని,
కొందరిలో ఆ తహ తహ, పర్వత సానువుల
రహస్యాల్ని, అరణ్యాల పాటల్ని మోసుకుపోతూ
అతి వడిగా ప్రవహిస్తూ, సముద్ర గర్భం చేరే
వడి గల ప్రవాహం మాదిరిగా వుంటుంది.
తక్కిన వారిలో ఆ తహ తహ, సాగర గర్భం
చేరక ముందే, గట్ల వంపుల్లో ఇంకిపోతూ
అతి నెమ్మదిగా ప్రవహించే చిన్న సెలయేరు
మాదిరిగా వుంటుంది.

తక్కువగా తొందర పడే వానితో, ఎక్కువగా
తహ తహలాడేవారు, "నువ్వు నెమ్మదిగా
ఈడ్చుకుంటూ నడుస్తున్నావు," అని అనకూడదు.
నిజమైన మంచివారు ఎప్పుడూ,
"మీ బట్టలు ఎక్కడ వున్నాయి?" అని
దిగంబరుల్ని అడగరు. అలాగే,
"మీ ఇల్లు ఏమైంది?" అని
ఇల్లు లేని వానినీ అడగరు.

*　　*　　*

# 22

"ప్రార్థన గురించి మాకు చెప్పండి," అని
ఒక పూజారిణి వారిని అడిగింది.
జవాబుగా ఆయన ఇట్లా చెప్పారు:

దుఃఖంలో వున్నప్పుడూ, అవసరమైనప్పుడూ
మీరు ప్రార్థిస్తారు.
సదా సంపూర్ణానందంలో వున్నప్పుడూ,
కాలం సర్వ సమృద్ధిగా గడచిపోతున్నప్పుడూ
అదే విధంగా ప్రార్థించండి.

ప్రార్థన అంటే, సజీవము - చైతన్యవంతము
అయిన విశ్వాంతరాళంలోకి మీకు మీరుగా
ప్రవేశించి, విస్తరించడం.

మీ సుఖానుభూతి కోసం మీ అంధకారాన్ని
ఆకాశంలో కుమ్మరిస్తే,
మీ ఆనందానుభూతి కోసం మీ హృదయ
ఉషా గమనాన్ని కూడా ఒలకబోసుకోవడమే
అవుతుంది.

మీ ఆత్మ, మిమ్మల్ని ప్రార్థించమని ప్రేరేపించి
నప్పుడు, మీరు ప్రార్థించకుండా

విలపిస్తూ వుంటే, ప్రార్థించమని అది పదే పదే
బలవంతం చేసి, ప్రోత్సహిస్తుంది.
అయినా మీరు ఇంకా విలపిస్తూ వుంటే,
మిమ్మల్ని నవ్వించే వరకు అది వూరుకోదు.
ప్రార్థించేప్పుడు, అదే సమయంలో మీ వలె
ప్రార్థించే వారందర్నీ కలుసుకునేందుకు
మీరు విస్తరిస్తారు.
ఒక్క ప్రార్థన ద్వారా తప్ప, మరో విధంగా మీరు
వారిని కలుసుకోలేరు–
అగోచరాలయదర్శనం కేవలం పరమానందం కోసం,
మధురమైన - అన్యోన్యమైన సంబంధం కోసం తప్ప,
మరి దేని కోసమూ కాకూడదు.
అర్థించాలనే ఉద్దేశ్యంతో మీరు ఆ ఆలయం ప్రవేశిస్తే,
మీరు దేన్నీ పొందలేరు.

ఆ ఆలయ ప్రవేశం, మీకు మీరు
విధేయులుగా వుండటం కోసమైనా సరే,
అందుమిమ్ము ఉద్ధరించే వారుండరు.
ప్రజా శ్రేయస్సుకై మీరు ఆ ఆలయం ప్రవేశించినా,
అందు మీ మొర ఆలకించు వారు వుండరు.
అసలు మీరు ఆ ఆలయం ప్రవేశించడమే
ముఖ్యమైన సంగతి. అది చాలు.

ఏ విధంగా ప్రార్థించాలో నేను మీకు మాటల్లో
బోధించలేను.
ఈశ్వరుడు తనకు తానై మీ పెదవుల ద్వారా

ఉచ్చరింపబడినప్పుడు తప్ప, మీ మాటల్ని
ఆయన వినరు.
సముద్రాలు - పర్వతాలు - అరణ్యాలు
ఎట్లా ప్రార్థిస్తాయో, నేను మీకు బోధించలేను.
కాని, మీరు కూడా ఆ సముద్రాల - పర్వతాల-
అరణ్యాల సంతతి వారే గనుక, వాటి ప్రార్థనను
మీరు మీ హృదయాంతరాళంలో వినగలరు.

రాత్రి నిశ్చలంగా వున్నప్పుడు వినగలిగితే,
మీకు వాటి ప్రార్థన వినపడుతుంది:

"ఓ దేవా, నీ సంకల్పమే, మాలోని నీ సంకల్పం
నీ వాంఛే, మాలోని వాంఛ. మాలోని
నీ ప్రేరణే, మా రాత్రుల్ని పగటి వేళలుగా
మారుస్తోంది. ఆ రాత్రులూ - పగటి వేళలూ నీవే!
మా అవసరాలు ఏమిటో, అవి మాలో
అంకురించక ముందే, నీకు తెలుస్తాయి గనుక,
మేము దేని కోసమూ నిన్ను అర్థించము.
మాకు కావలసింది నువ్వు. మేము కోరేది, నిన్ను.
నిన్ను నీవు పూర్తిగా ఇచ్చుకోవడంతో,
మాకు సమస్తం ఇచ్చినట్లే.

*　　　*　　　*

# 23

ఏడాదికి ఒకసారి నగరానికి ఏతెంచే సాధు ఒకరు
ముందుకు వచ్చి, "ఆనందం అంటే ఏమిటి?" అని
అడిగారు.
ఆయన చెప్పారు:

ఆనందం ఒక స్వేచ్ఛా గీతమే కాని, స్వేచ్ఛ కాదు.
కోర్కెల వికాసమే ఆనందం కాని, కోర్కెల ఫలితం కాదు.
ఔన్నత్యాన్ని అగాధం ఆహ్వానించడమే, ఆనందం.
కాని, అది లోతూ కాదు; ఎత్తూ కాదు.
పంజరంలోని పక్షి ఎగరాలని యత్నించడమే
ఆనందం.
కాని, ఆనందం ఒక ఆవృతమైన ఆవరణ కాదు.

నిజానికి, ఆనందం ఒక స్వేచ్ఛా గీతం.
హృదయ మంతటితో మీరు ఆ గీతాలాపన చేస్తే,
నాకు సంతోషమే కాని, ఆ గీతాలాపనలో
మీరు మీ హృదయాల్ని పోగొట్టుకోవద్దు.

మాలో కొందరు పడుచువారు
సుఖమే సర్వస్వమనుకుని, దాన్నే కోరుకుని,
అసమ్మతికీ, విమర్శలకూ గురి అవుతారు.
నేను అసమ్మతి తెలుపను. వారిని విమర్శించను.

వారిని అన్వేషించుకోనిస్తాను.
ఆ అన్వేషణలో వారు కనుక్కునేది, ఒక్క సుఖాన్నే కాదు;
దానికి ఏడుగురు అక్క - చెల్లెళ్ళు వున్నారని—
వారిలో చిన్నది, సుఖం కన్నా అందమైనదనీ
వారు అప్పుడు తెలుసుకుంటారు.
కందమూలాదుల కోసం ఒకతను భూమిని
లోతుగా తవ్వగా, అతనికి నిధి దొరికిన సంగతి
మీకు తెలియదా?

మీ పెద్దల్లో కొందరు ఆనందాన్ని తప్పు తాగినప్పుడు,
చేసిన తప్పుగా విచారంతో జ్ఞాపకం పెట్టుకుంటారు.
విచారం, మనసుపై ముసుగు వంటిదే కాని,
మనసుకు దండన కాదు.

వేసవికాలపు ఫలసాయాన్ని అనుభవిస్తున్నట్లు,
వారు తమ ఆనందాల్ని కృతజ్ఞతతో జ్ఞాపకం పెట్టుకోవాలి.
అయినప్పటికీ విచారించడంలోనే వారికి
సుఖం వుంటే, వారిని అట్లానే సుఖ పడనివ్వండి.

మీలో కొందరున్నారు,
వారు ఆనందాన్వేషణ చేసే పడుచువారూ కాదు.
విచారంతో దాన్ని జ్ఞాపకం పెట్టుకునే
పెద్దవారూ కాదు.
అన్వేషణా విషయంలోనూ, జ్ఞాపకం పెట్టుకోవ
డంలోనూ - వారు పడే భయంలో
అన్ని ఆనందాల్ని విసర్జిస్తారు.
వారు ఆత్మను ఉపేక్ష అయినా చేయవచ్చు. లేదా,
దాని మొదల తప్పుగా నైనా ప్రవర్తించవచ్చు.

కానీ, అలా ముందుకు సాగడంలోనే, వారికి
ఆనందం వుంది.

వణికే చేతులతో వారు కందమూలాదుల కోసం
భూమిని తవ్వినా, వారికి కూడా ఆ అమూల్య నిధులు
లభ్యమౌతాయి.

కాని, నాకు చెప్పండి - ఆత్మకు ఎదురు తిరిగి
అపచారం చేయగలిగిన వాడెవడు?
రాత్రి ప్రశాంతతకు నైటింగేల్ కోపగించుకుంటుందా?
నక్షత్ర కాంతికి, మిణుగురు పురుగు కోపం తెచ్చు
కుంటుందా?
మీ జ్వాల కాని, ధూమం కాని గాలికి భారమౌతాయా?
కర్రతో కదిపి, అలజడి రేపేందుకు
ఆత్మను నిశ్చలమైన ఒక నీటి మడుగు
అనుకుంటున్నారా?

మీకై మీరు అనేకసార్లు ఆనందాన్ని నిరాకరించినప్పుడు,
మీ అస్తిత్వపు లోతుల్లో పోగుజేసుకున్న కోర్కెను
భద్రపరచుకుంటారు.

ఈ రోజు వదలి పోయినట్లు కనుపించేదే,
రేపటికి కాచుకుని వుంటుందేమో! ఎవరికి తెలుసు?
దేహాలకు సైతం తెలుసు—
న్యాయమైన తమ అవసరాలు ఏమిటో,
తమ వారసత్వాలేమిటో!
వాటి విషయంలో అవి ఏ మాత్రం మోసపోవు.
మీ ఆత్మకు, మీ దేహం, వీణ.

దాన్నించి మధురమైన సంగీతాన్ని కాని, కలవర పరిచే
శబ్దాల్నిగాని పలికించే వారు మీరే!

"ఆనందంలో ఏది మంచిది? ఏది చెడ్డది?
ఎట్లా విచక్షణ చేయడం?" అని మీరు
మీ హృదయాంతరాళాల్లో ప్రశ్నించుకోండి.
పొలాల్లోకీ, పూల తోటల్లోకి వెళ్ళండి—
పువ్వుల్లోంచి, మకరందాన్ని సేకరించడం,
తేనెటీగకూ, తన మకరందాన్ని తేనెటీగకు
అందివ్వడం పువ్వుకీ ఆనందమని తెలుసుకుంటారు.
తేనెటీగకు పువ్వు, ఉప్పొంగే జీవన జలధి.
పువ్వుకి, తేనె టీగ ప్రేమ దూత.
ఇచ్చి - పుచ్చుకోవడం ఆ రెండింటికీ
అవసరం - ఆనందదాయకం.

ఆర్ఫలీజు వాసులారా, మీరు మీ ఆనందాల్లో
పువ్వులు - తేనెటీగలు మాదిరిగా వుండండి.

* * *

# 24

"సౌందర్యం అంటే ఏమిటో మాకు చెప్పండి," అని
ఒక కవి ఆల్ ముస్తఫాను అడిగాడు.
ఆయన జవాబు చెప్పారు:

సౌందర్యం ఎక్కడని వెదుకుతారు?
అది మీకు మార్గంగా, మార్గదర్శిగా లేకపోతే,
ఇంక దాన్నెట్లా కనుక్కోగలరు?
మీ మాటల్ని అల్లేది సౌందర్యం కాకపోతే,
ఇంకదాని గురించి మీరేం మాట్లాడగలరు?

"సౌందర్యం, కరుణామయి - సుకుమారి.
తన వైభవానికి తాను సిగ్గుపడే
యవ్వన మాతృమూర్తి వలె. సౌందర్యం మసలు
తుంది," అని దుఃఖితులూ, గాయపడిన వారూ అంటారు.
కాదు, సౌందర్యం శక్తి స్వరూపిణి, భీకరరూపిణి.
ఝుం ఝూమారుతం వలె అది మన కాళ్ళ కింది
భూమినీ, పై ఆకాశాన్నీ వూపేస్తుంది," అని
ఉద్రేకులు అంటారు.

"మృదు సంభాషణలతో సౌందర్యం
మన ఆంతర్యంలో పలుకుతుందనీ,
నీడ భయంతో వణకి పాలిపోతున్న కాంతి వలె,

సౌందర్య వాణి మన మౌనానికి వశమౌతుంది," అని
విసిగిన వారూ, అలసిన వారూ అంటారు.

సౌందర్యం, పర్వతాల మధ్య కేకలు వేయడం మేము విన్నాం.
ఆ అరుపుల్లో డెక్కల చప్పుళ్ళు, రెక్కల రెప రెపలూ
సింహ గర్జనలూ విన వచ్చాయి," అని
అశాంతి పరులు అంటారు.

"ప్రభాత వేళ సూర్యునితో పాటు సౌందర్యం
ఉదయిస్తుంది," అని నగర తలారులు చెపుతారు.

"సూర్యాస్తమయ గవాక్షాల నుంచి సౌందర్యం
భూమికి తొంగి చూడ్డం మేము చూశాము," అని
శ్రామికులు - ప్రయాణీకులు మధ్యాహ్న వేళ లందు
అంటారు.

శీతాకాలంలో - మంచు కప్పే ప్రాంతాల్లో నివసించే
వారు అంటారు, "వసంతంతో పాటు కొండల
మీదకు సౌందర్యం దూకుతూ వస్తుంది," అని.

హేమంతంలో రాలే చెట్ల ఆకులతో కలసి, సౌందర్యం
నర్తించడం మేము చూశాము. దాని శిరోజాల్లో
హిమతుషారాలు కొట్టుకు పోవడం గమనించాం,"
అని వేసవి ఎండల్లో పంట కోసుకునే
కర్షకులు అంటారు.

సౌందర్యం గురించి మీరు ఇన్ని సంగతులు చెప్పారు.
నిజానికి, అసంతృప్తికరమైన
మీ అవసరాల గురించే చెప్పారు కాని,
అసలు సౌందర్యం గురించి మీరు చెప్పలేదు.

సౌందర్యం ఒక అవసరం కాదు, ఆనంద పారవశ్యం.
సౌందర్య మంటే, దాహం గొన్న గొంతుకాదు.
చాచిన శూన్య హస్తమూ కాదు.
హృదయ ప్రజ్వలనం. ఆత్మ మంత్రముగ్ధం కావడం.

చూసేందుకు సౌందర్యం, ఒక మూర్తి కాదు.
వినేందుకు సౌందర్యం, ఒక గీతమూ కాదు.
కనులు మూసుకున్నా చూడగలిగే రూపమే, సౌందర్యం.
చెవులు మూసుకున్నా వినగలిగే గీతమే, సౌందర్యం.
సౌందర్యమంటే, చెట్టు బెరడులోని సారం కాదు.
పక్షి గోటికి అతుక్కున్న రెక్కా కాదు.
సౌందర్యమంటే, నిత్యం పుష్పించే వనం.
నిరంతర గగనతలంలో దేవతల సమూహం
విహరించడం.

ఆర్ఫలీజు వాసులారా! సౌందర్యమే, జీవితం.
తన దివ్యమైన వదనం మీది ముసుగును
తొలగించిన జీవితమే, సౌందర్యం.
కాని, మీరే ఆ జీవితం. మీరే ఆ ముసుగు.
తనను తాను అద్దంలో చూసుకునేది దివ్యత్వమే,
సౌందర్యం.
కాని, మీరే ఆ దివ్యత్వం. మీరే ఆ అద్దం.

*   *   *

# 25

"మతం అంటే ఏమిటో చెప్పండి" అని ఒక వృద్ధ
మత గురువు ఆల్ ముస్తఫాను అడిగారు.
ఆయన చెప్పారు:

ఈ రోజు నేను మాట్లాడింది మతం కాక మరేమిటి?
సర్వ కర్మలు, సమస్త ఫలితాలు మతం కాదా?
సుత్తి పెట్టి రాతిని బద్దలు కొడుతున్నా,
చేతులతో మగ్గం నేస్తున్నా, నిరంతరం అంతరాత్మలో
అద్భుతంగా, ఆశ్చర్యకరంగా ఉప్పొంగేదీ మతం కాదా?
అది, ఏదో ఒక కార్యమూ, ఒక ప్రతిఫలం కాకపోవచ్చు.
ఒకరు చేసే పనుల నుంచి, వారి విశ్వాసాన్ని
ఎవరు వేరు చేయగలరు?

ఒకరి మనో నిర్ణయం నుంచి, వారి ధర్మాన్ని
ఎవరు వేరు పరచగలరు?
"ఇది ఈశ్వరుడికి - ఇది నాకు - ఇది నా ఆత్మకి,
—— ఇది నా దేహానికి," అని ఎవరు తమ కాలాన్నంతా
ఆయన ముందు ఉంచగలరు?
ఆత్మకు - ఆత్మకు మధ్య స్పందిస్తూ సంచరించే
పక్షులే, మీ కాలం.
శీలాన్ని పట్టు బట్టగా ధరించడం కన్నా,
నగ్నంగా వుండటం నయం.

అటువంటి వారి నగ్న శరీరాన్ని గాలి, ఎండ చీల్చవు.
తన నడవడి నీతి బద్ధమైనదని నిర్వసించే వాడు,
తన గాన విహంగాన్ని, పంజరంలో బంధిస్తాడు.
స్వేచ్ఛా గానం ఎప్పుడూ ఊచల, తీగల మధ్య నుంచి
రాదు.

మూయడానికీ, తెరవడానికి "ఆరాధన" అనే దాన్ని
ఒక గవాక్షంగా ఎవరైతే ఎంచుతారో, వారు
వేకువ నుంచి వేకువకు తెరచి వున్న కిటికీలు గల
తమ ఆత్మ గృహాన్ని ఇంతవరకూ చేరుకోలేదు.

మీ నిత్య జీవితమే, మీ ఆలయం, మీ మతం.
ఆ ఆలయంలో మీరు ఎప్పుడు ప్రవేశించినా,
మీ వెంట మీ సర్వస్వాన్ని తీసుకు వెళ్ళండి.
మీకు అవసరమూ, సంతోషదాయకమూ
అయిన, మీ నాగలి - కొలిమి - కొయ్య సమ్మెట -
వీణ - సమస్తం మీ వెంట తీసుకు వెళ్ళండి.
మీరు సాధించిన వాటికన్నా మీ ఆరాధనలో,
మీరు పైకి ఎగరలేరు.
మీ అపజయాల కన్నా, కిందికి జారలేరు.
మీతోపాటు సమస్త ప్రజానీకాన్ని
వెంట తీసుకువెళ్ళండి.
ఆరాధనలో మీరు వారందరి ఆశల కన్నా
పైకి ఎగరలేరు. వారి నిరాశల కన్నా
కిందికి దిగజారలేరు.

ఈశ్వరుణ్ణి తెలుసుకోవాలనుకుంటే,
జటిల సమస్యా పరిష్కార కర్తలుగా వుండకండి.
అంతకన్నా మీ చుట్టూ చూడండి—
పిల్లలతో కలసి ఆయన ఆడుకోవడం చూస్తారు.
విశ్వాంతరాళంలోకి చూడండి—
మబ్బుల్లో తేలి ఆడుతూ, మెరుపుల్లోంచి ఆయన
చేతులు చాస్తో, వర్ష రూపంలో కిందికి దిగడం
చూస్తారు.
పువ్వుల్లో ఆయన నవ్వడం, చెట్లలోంచి
ఆయన చేతులెత్తి వూపడం మీకు కనుపిస్తాయి.

*     *     *

## 26

"మృత్యువు గురించి తెలుసుకోవాలనుకుంటున్నాం"
అని ఆల్మిత్రా వారిని అడిగింది.
ఆయన చెప్పారు:

మీరు మృత్యు రహస్యం తెలుసుకోవాలనుకుం
టున్నారు. కాని, మీరు దాన్ని మీ జీవన
హృదయంలో వెదకకపోతే, ఇంకెట్లా
కనుక్కోగలరు?

రాత్రులందే చూడగలిగే గుడ్లగూబ,
పగటి కాంతుల రహస్యాల ముసుగులు
తొలగించలేదు.

మీరు నిశ్చయంగా మృత్యు స్వరూపాన్ని చూడదలిస్తే,
మీ హృదయాన్ని జీవితాంతం విశాల పరచండి.
నదీ - సముద్రం ఒకటే అయినట్లు,
జీవితం - మృత్యువు ఒకటే.

మీ ఆశల, వాంఛల లోతుల్లో ఆముష్మిక జ్ఞానం
వుంది.
మంచు కింది విత్తనాలు కలలు కన్నట్లు,
హృదయం వసంత స్వప్నాలు కంటుంది.
ఆ స్వప్నాల్లో స్వర్గ ద్వారం నిగూఢంగా వుంది కనుక
ఆ స్వప్నాలను విశ్వసించండి.

రాజుగారు స్వహస్తాలతో తనను గౌరవిస్తాడని
తెలిసి కూడా, గొల్లవాడు భయంతో ఎట్లా వణకుతాడో,
అట్లా వుంది, మీ మృత్యు భీతి.
రాజ ముద్ర ధరించబోయే ఆ గొల్లవాడు,
ఒక పక్క భయంతో వణకుతున్నా,
అంతర్యంలో ఆనందంగా వుండడా?

అలాగే ఆ గొల్లవాడు తన కలవరానికి
పూర్తి ఎరుకలో వుండడా?

చనిపోవడమంటే, గాలిలో నగ్నంగా నిలవడం.
సూర్యకాంతికి కరగడం.

శ్వాస ఆగిపోవడమంటే, విరామం లేని
ఉఛ్వాస - నిశ్వాసల నుంచి, శ్వాసను, స్వేచ్ఛ పరచడం.
స్వేచ్ఛ పొందిన ఆ శ్వాస, పైకెగసి,
విశ్వమంతా వ్యాపించి, ఈశ్వరాన్వేషణ చేయడం కదా?

మౌన నదీ జలాల్ని మీరు తాగినప్పుడే,
మీరు నిశ్చయంగా పాడగలరు.
పర్వత శిఖరం చేరిన తర్వాతే,
మీరు దాన్ని ఆరోహించ నారభిస్తారు.
మీ అవయవాల్ని భూమి తనవని అన్నప్పుడే,
మీరు నిజంగా నాట్యం చేస్తారు.

* * *

# 27

సాయంత్రమైంది.
"ఈ రోజు, ఈ ప్రదేశం, ముచ్చటించిన మీ ఆత్మ
ధన్యం" అని మహాత్మురాలు - అల్ మిత్రా అన్నది.
"ఆ మాట్లాడింది నేనేనా? నేను కూడా ఒక
శ్రోతను కానా?" అని అల్ ముస్తఫా అన్నారు.

ఆయన ఆలయం మెట్లు దిగగానే,
పురజను లందరూ ఆయన్ని అనుసరించారు.
ఆయన తన ఓడ చేరుకుని, దాని పై భాగాన నిలబడ్డారు.

అక్కడ చేరిన వారందర్నీ పరికిస్తూ,
ఎలుగెత్తి ఇట్లా అన్నారు:

ఆర్ఫలీజ్ వాసులారా,
మీ నుంచి వీడ్కోలు తీసుకోమని
సమీరం నన్ను ఆజ్ఞాపిస్తోంది.
నేను గాలి కన్నా ఎక్కువ వేగిర పడటం లేదు.
అయినా నేను వెళ్ళాలి.
మేము సదా సంచారులం.
ఏకాంత మార్గాన్వేషకులం.
ఒక రోజు వున్నచోట, మరో రోజు వుండం.
భూమి నిద్రిస్తున్నా, మేము నిరంతర పథచారులం.
మేము మర్రి విత్తనాల వంటి వాళ్ళం.
మా పక్వదశలో, మా హృదయపు నిండుదనంలో
మేము గాలికి అర్పణై, వెదజల్ల బడతాం.

నేను మీ మధ్య గడిపిన రోజులు, బహుకొద్ది.
నేను మీతో మాట్లాడింది, అతి స్వల్పం. కానీ,
మీ వీనులలో వాణి అణగినా,
మీ స్మృతి పథం లోంచి నా ప్రేమ తొలగినా,
అప్పుడే నేను తిరిగి వస్తాను—
వస్తాను, మరింత విశాల హృదయంతో, ఆత్మతో.
మీ వద్దకు వచ్చి, మిమ్మల్ని పలకరిస్తాను.
కడలి పోటుతోపాటు తిరికి వస్తాను.
మత్యువు నన్ను దాచేసినా, మౌనం నన్ను ఆవహించినా
నేను మరొకసారి మీ సమజానికి వచ్చి,
మీ సత్యాన్వేషణను పరిశీలిస్తాను.

నా పరిశీలన వృథాకాదు.
నేను ఏదైనా చెప్పి వుంటే, అది సత్యం.
ఆ సత్యం, నిర్మల వాక్కుల్లో వ్యక్త మౌతుంది.
అది మాటల్లో మీ ఆలోచనల్ని మరింత
సన్నిహితంగా తాకుతుంది.

ఆర్ఫలీజు వాసులారా, నేను గాలి వాలున
పోతున్నానే కాని, అగాధ శూన్యంలోకి కాదు.
మీ అవసరాలకు, నా ప్రేమకు
ఈ రోజు సాఫల్యం చేకూర్చకపోతే,
దీన్ని మరో రోజుకు ప్రమాణంగా వుండనివ్వండి.
మనిషి అవసరాలు మారతాయి గాని,
అతని ప్రేమ మారదు.
తన అవసరాల్ని తీర్చి, తృప్తి పరచాలనే
అతని వాంఛా మారదు.
కనుక నేను ఆ మహా మౌనం లోంచి తిరిగి వస్తానని
తెలుసుకోండి.

పొలాల్లో పొగమంచు హిమబిందువుల్ని దిగ జార్చి,
తాను పైకెగసి, మబ్బుగా మారి,
వర్ష రూపంలో కింద పడుతుంది.
నేనూ ఆ పొగమంచు మాదిరిగా వున్నాను.
రాత్రి నిశ్చలత్వంలో నేను మీ వీధుల్లో తిరిగాను.
నా ఆత్మ మీ గృహాల్లో ప్రవేశించింది.
నా హృదయంలో, మీ హృదయ స్పందనాలు.
నా ముఖాన మీ శ్వాస.
మిమ్మందర్నీ నేనెరుగుదును.

మీ ఆనందం, మీ బాధ నేను ఎరుగుదును.
నిద్రలోని మీ కలలు, నా స్వప్నాలే!
కొండల మధ్య సరస్సు వలె,
నేను మీ మధ్య అనేకసార్లు వున్నాను.
మీ ఉన్నత శిఖరాలను, మలుపులు తిరిగిన వంపులను,
చలించి - కదలిపోయే మీ ఆలోచనలను, కోర్కెలను
అద్దంలో చూసినట్లు, మీలో చూశాను.
మీ పిల్లల చిరునవ్వులు, సెలయేళ్ళుగా;
మీ యవ్వనుల ఆశలు నదులుగా నా మౌనాన్ని
చేరాయి.

ఆ సెలయేళ్ళు నా ఆంతర్యాన్ని చేరాయి.
ఆ నదులు, నా చుట్టూ గానం చేస్తూ వున్నాయి.
కాని, ఆ నవ్వుల కన్నా మధురమైనదీ,
ఆ ఆశల కన్నా ఉన్నతమైనదీ నన్ను చేరింది.
అది మీలోని దైవత్వం.

మీరంతా ఆ విశ్వపురుషునిలో పరమాణువులు - బలమైన
కండరాలు.
ఆయన పాటలో మీ గానమంతా శబ్ద రహిత స్పందనం.
మీరంతా ఆ విశ్వ పురుషునిలో వుండటం వలన,
మీరూ విశ్వరూపులైనారు.
నేను ఆ విశ్వ పురుషుని ఆలింగనం చేసుకోవడంలో
మిమ్మందర్నీ హృదయానికి హత్తుకున్నాను.
మిమ్మందర్నీ ప్రేమించాను. ఎందుకంటే,
విశ్వాంతరాళంలో లేని ఏ దూరాలను
ప్రేమ చేరుకోగలదు?

ఏ దివ్య దృశ్యాలు - ఏ ఆపేక్షలు - ఏ గాఢ విశ్వాసాలు
ఆ ఎత్తుకు ఎగరగలవు?

బ్రహ్మాండమైన ఓక్ వృక్షం, యాపిల్ పువ్వులతో
కప్పబడ్డట్లు, మీలో ఆ దివ్య పురుషుడు వున్నాడు.
ఆయన శక్తి, మిమ్మల్ని భూమికి బంధిస్తుంది.
ఆయన పరిమళం, మిమ్మల్ని ఆకాశానికి ఎత్తుతుంది.
ఆయన అనంతత్వంలో, మీరు అమరులు.

"గొలుసు కొక్కాలలోని బలహీనమైన ఒక కొక్కెం వలె
మీరు వున్నారు," అని కొందరు మిమ్మల్ని అన్నారు.
ఆ మాట పూర్తిగా నిజం కాదు.
ఆ గొలుసులోని బలీయమైన కొక్కెమంత
బలాఢ్యులు కూడా మీరు.

మీరు చేసిన ఒక అల్పమైన పనిని తీసుకుని,
కెరటాల నురుగు చూసి, సాగర సామర్థ్యాన్ని
అంచనా వేసినట్లు వుంటుంది, మిమ్మల్ని కొలవడం.
మీ అపజయాల ఆధారంగా మిమ్మల్ని నిర్ణయించడం,
ఋతువుల చాంచల్యాన్ని చూసి
వాటికి స్థిరత్వంలేదని నిందించినట్లు వుంటుంది.

మీరు సముద్రం వలె వున్నారు.
సరకులతో నిండిన ఓడలు మీ తీరాల నుంచి
కదలడానికి ఎదురు చూస్తున్నా, కడలి మాదిరిగా
మీరూ మీ ఆటు - పోటుల్ని తొందర పెట్టలేరు.

మీరు ఋతువులు మాదిరిగా కూడా వున్నారు.
మీరు శీతాకాలంలో వుండి, వసంతాన్ని నిరాకరించినా,
మీలో ఆ వసంతం విశ్రాంతి తీసుకుంటూ
నిద్రమత్తులో వుండి, మీ నిరాకరణను చూసి
నవ్వుకుంటుందే కాని, మీపై కోప్పడదు.

"ఆయన మనలను బాగా మెచ్చుకున్నారు.
ఆయన మనలోని మంచినే చూశారు," అని
మీరు నా గురించి ఒకొరికొకరు
చెప్పుకోవాలని నేనివన్నీ ఒక క్రమంలో
చెపుతున్నాననుకోకండి.
మీరు మీ ఆలోచనల్లో తెలుసుకునే
సంగతుల్నే, నేను మాటల్లో చెపుతున్నాను.
శబ్ద రహితమగు జ్ఞానం యొక్క ఛాయే,
శబ్ద సహితమగు జ్ఞానం.

భూమినీ - మననీ - సృష్ట్యారంభకాలాన్ని—
భూమి, తాను ఘర్షణతో శిథిలమైన రాత్రి కాలాన్ని—
మన గత సంగతులన్నింటినీ రాసి,
దాచి, మూసి వుంచిన స్మృతి భాండం నుంచి
లేచిన కెరటాలే - మీ ఆలోచనలు, నా మాటలు.

తమ జ్ఞానాన్ని మీకు అందివ్వాలని కొందరు జ్ఞానులు
మీ వద్దకు వచ్చారు. కాని, నేను మీ జ్ఞానాన్ని
తీసుకోవడానికి వచ్చాను.
జ్ఞానం కన్నా గొప్ప సంగతి తెలుసుకున్నాను.

అది - మీలో నిరంతరం కేంద్రీకృతమై,
ప్రజ్వరిల్లుతూ వెలిగే ఆత్మజ్యోతి.
ఆ ఆత్మజ్యోతి కాంతి విస్తరణ విషయంలో
మీరు నిర్లక్ష్యంగా వుండి, కాలం వృథాగా
గడచి పోతోందని దుఃఖిస్తారు.
మృత్యువుకు భయపడే దేహాల్లో
జీవితాన్వేషణ చేసే జీవనమే, ఆ ఆత్మ.

ఇక్కడ సమాధులు లేవు.
ఈ పర్వతాలే, ఊయలలు.
విశాలమైన ఈ మైదానాలే, సోపానాలు.
మీ పూర్వీకుల సమాధుల పక్క నుంచి
మీరు ఎప్పుడైనా వెడితే, అక్కడ మీరూ,
మీ పిల్లలూ చేతులూ - చేతులూ కలిపి
నాట్యం చేయడం చూడగలరు.
మీకు తెలియకుండానే, మీరు తరచు
వినోదిస్తారు.

మీ వద్దకు మరి కొందరు వచ్చారు.
మీ విశ్వాసానికి అపూర్వమైన వాగ్దానాలు చేశారు.
వారికి మీరు ప్రతిఫలంగా మీ ఆస్తినీ,
అధికారాన్నీ, కీర్తినీ ఇచ్చారు.
మీకు నేను ఏ వాగ్దానమూ చేయలేదు.
అయినా మీరు నాయందు దయగా వున్నారు.
"జీవితానంతరం ఏమిటి?" అనే గట్టి వేదనను
మీరు నాకు ఇచ్చారు.

జీవితాశయాలన్నీ కాల్చే పెదవులుగా,
జీవితమంతా పెల్లుబికి పొంగే నిర్ఝరిగా,
మారడం కన్నా, మనిషికి మరో గొప్ప కానుక లేదు.
దీంట్లోనే నా గౌరవం, ప్రతిఫలం వున్నాయి.
దప్పికతో నేను ఆ నిర్ఝరిలో నీళ్ళు తాగాలని
వెళ్ళినప్పుడు, ఆ సజీవజలం కూడా దప్పికతో వుందని
గమనించాను.
ఆ నీరు నేను తాగుతో వుంటే, అది నన్ను తాగుతోంది.

కానుకలు స్వీకరించడంలో నేను సిగ్గు పడతానని
మీలో కొందరు అనుకున్నారు.
కూలి తీసుకోవడంలో నేను నిజంగా చాలా గర్విష్ఠిని కాని,
కానుకలు స్వీకరించడంలో కాదు.
మీ సహపంక్తిని నన్ను భోజనానికి
కూర్చోపెట్టుకోవాలనుకున్నప్పుడు,
నేను అడవుల్లో రేగి పళ్ళు ఏరుకు తిన్నాను.
సంతోషంతో నాకు మీరు రక్షణ ఇవ్వాలను కు
న్నప్పుడు, నేను దేవాలయ మండపంలో నిద్రించాను.
పగలు నేను తిన్న తిండిని మధురంగా మార్చిందీ,
రాత్రి నా నిద్రను దివ్య దృశ్యాలతో నింపిందీ
నా యందు మీకు గల ప్రేమ పూరితమైన
జాగరూకతా జ్ఞాపకమే కదా!

ఎంతో ఇచ్చి, ఇచ్చామన్న విషయం ఎరుగని
మిమ్మల్ని నేను మరింత గాఢంగా దీవిస్తాను.
తనని తాను అద్దంలో చూసుకునే దయ,
నిశ్చయంగా బండబారిపోతుంది.

తనని తాను మృదువైన మాటలతో పిలుచుకునే
సత్కార్యం, క్రమంగా శాపానికి మూల కారణం అవుతుంది.

నేను ఏకాకిననీ, ఎప్పుడూ ఏకాంతపు మత్తులోనే
వుంటాననీ మీలో కొందరి భావన.
మీలో మరి కొందరు నా గురించి,
"ఆయన అరణ్యాల్లోని చెట్లతో సభ తీర్చి, సఖ్యతగా
వుంటాడే కాని, మనుష్యులతో మసలడు.
కొండ కొనల ఒంటరిగా కూర్చుని మన నగరాన్ని
తక్కువగా చూస్తాడు," అని అన్నారు. అది నిజమే!
నేను కొండలు ఎక్కాను. దూరపు స్థలాలు తిరిగాను.
అంత ఎత్తు నుంచీ, అంత దూరం నుంచీ కాక
మిమ్మల్ని చూడ్డం మరెట్లా? దూరంగా లేనిది,
దగ్గర కావడం అనేది ఎట్లా జరుగుతుంది?

మీలో కొందరు నా గురించి మాటల్లో కాదు కాని
మనసులో అనుకున్నది, "అపరిచితుడా,
పరదేశీ! అనంత ఔన్నత్యాన్ని ప్రేమించే వాడా!
గద్దలు గూళ్ళు గట్టుకునే ఆ కొండ శిఖరాల
ఎందుకు నివాసముంటావు?
అసాధ్యమైన దానిని ఎందుకు అన్వేషిస్తావు?
ఏ పెను తుఫానుల్ని నీ వలతో పట్టదలిచావు?
ఏ వాయు విహంగాల్ని ఆకాశంలో వేటాడుతున్నావు?
రా! వచ్చి, మాలో ఒకరివై పో.
కిందికి దిగివచ్చి, మేము పెట్టే భోజనం తిని,

నీ ఆకలి తీర్చుకో. మేము ఇచ్చే ద్రాక్ష సారాయి తాగి,
నీ దప్పిక ఆర్చుకో!" అని.

అంతేకాదు, వారి ఆత్మల అంతర్యంలో,
ఇంకా ఎన్నో సంగతులు అనుకున్నారు.
వారి అంతర్యాలు మరింత గాఢమైనవి అయివుంటే,
వారి సుఖ - దుఃఖాల రహస్యాలను
నేను అన్వేషించానన్నదీ, అంతరిక్షాన నడయాడే
వారి వికసిత వ్యక్తిత్వాలను మాత్రమే
నేను వేటాడానన్నదీ వారు తెలుసుకుని వుండేవారు.
కాని, వేటగాడు కూడా వేటాడబడ్డాడు.
నా గుండెను తాకి శోధించేందుకే నా బాణం నుంచి
ఎన్నో అంబులు వెలువడ్డాయి.
పైకి ఎగిరి వెళ్ళిన వాడే, మెల్లిగా కిందికి జారి పడతాడు.
సూర్యకాంతిలో నా రెక్కలు పరచుకున్నప్పుడు,
నేలమీద నా నీడ, తాబేలు మాదిరిగా వుంది.
విశ్వాసినైన నేనే, సంశయాత్ముణ్ణి కూడా.
మీలో గొప్ప విశ్వాసం కుదుర్చుకోవడానికీ,
మీ నుంచి ఎంతో జ్ఞానాన్ని పొందడానికీ,
నా గాయాన్ని నేనే పదే పదే రేపుకున్నాను.
ఈ జ్ఞానంతో - ఈ విశ్వాసంతో నేను చెప్తున్నాను:

మీరు, మీ దేహాల్లో బందీలై లేరు.
మీరు మీ ఇళ్ళకూ, పొలాలకూ కట్టుబడి లేరు.

మీరు పర్వత శిఖరాల నివాసముంటున్నారు.
గాలితో పాటు కదులు తున్నారు.
వెచ్చదనం కోసం ఎండలోకి పాకడానికీ,
రక్షణ కోసం చీకటి గోతులు తవ్వుకోవడానికి
ఇదొక, కీటకం కాదు. కాని,
అది - అవనీతలమంతా ఆక్రమించి,
ఆకాశమంతా విహరించే స్వేచ్ఛాయుత ఆత్మ.

ఈ మాటలు అస్పష్టంగా వుంటే,
వాటిని స్పష్టం చేయాలని చూడకండి.
అన్నింటి ఆరంభం, అయోమయం, అస్పష్టం. కాని,
వాటి అంతంలో అట్లా వుండదు.
మీరు నన్ను ఆరంభంగా జ్ఞాపకం పెట్టుకోవడమే
సంతోషం.
సమస్త ప్రాణికోటి గర్భధారణ,
పొగమంచు నందే జరుగుతుంది కాని, కఠిన
శిలలో కాదు. క్షీణ దశలో వున్న మంచుగడ్డే,
పొగమంచు అని ఎందరెరుగుదురు?

మీరు నన్ను జ్ఞాపకం ఉంచుకోవడంతో పాటు,
ఇవన్నీ కూడా జ్ఞాపకం ఉంచుకోండి.
మీరు నన్ను తలచుకున్నప్పుడు,
నా మాటల్ని కూడా తప్పకుండా జ్ఞాపకం ఉంచుకోండి.
మీలో చాలా బలహీనంగా, దిగ్భ్రమ కలగజేసేదిగా

ఏదైతే వుందను కుంటున్నారో;
అది మీలో చాలా బలీయంగా, ఎంతో దృఢంగా వుంది.

మీ ఎముకల్ని నిలబెట్టిందీ,
వాటి నిర్మాణాన్ని గట్టి పరచిందీ మీ శ్వాస కాదా?
మీ నగరాన్ని నిర్మించిందీ,
అందు అన్ని అందాల్ని అమర్చిందీ మీ కల కాదా?
అట్టి కల కంటున్నామని మీలో ఏ ఒక్కరూ
అనుకోవడం లేదు.

మీరు శ్వాస ఆటు - పోటుల్ని గమనిస్తే,
తక్కిన వాటిని చూడ్డం మానేస్తారు.
ఆ కలలోని గుస గుసల్ని వింటే,
ఇంకే శబ్దాల్ని వినరు.
కాని, మీరు వినరు, చూడరు. అది బాగానే వుంది.

మీ కన్నులను కప్పిన మాయపొరల్ని
ఏ చేతులు నేశాయో, అవే ఆ తెరల్ని తొలగించగలవు.
ఏ వేళ్ళు మీ చెవుల్ని బంకమట్టితో పూడ్చాయో,
ఆ వేళ్ళే ఆ బంకమట్టిని గుచ్చి, బైటికి తీసి, పారెయ్యగలవు.
అప్పుడు మీరు చూడగలరు, వినగలరు.

గతంలో అంధత్వం వుండేదని దుఃఖ పడకండి.
బధిరత్వముండేదని బాధ పడకండి.

"అన్నింటిలో ఒక నిగూఢమైన సంకల్పం వుంది," అనే
సంగతి మీరు ఆనాడు తెలుసుకుంటారు.
తేజస్సును దీవించినట్లే, అంధకారాన్ని ఆశీర్వదిస్తారు.

ఆల్ ముస్తఫా ఈ సంగతులన్నీ, చెప్పి, చుట్టూ చూశారు.
ఓడ కర్ణధారి చుక్కాని పట్టుకుని నిలబడి,
రెపరెపలాడే తెరచాపల్నీ, ముందుదారినీ చూస్తున్నాడు.
ఆయన అన్నారు:

నా కర్ణధారి ఓపికతో, బహు ఓర్మితో వున్నాడు.
గాలి విసురుతోంది.
తెరచాపలు అశాంతిగా కొట్టుకుంటున్నాయి.
తనను నడపమని చివరికి చుక్కాని కూడా
ప్రాధేయపడి అడుగుతోంది.
అయినా, నా కర్ణధారి నా మౌనానికి,
నిశ్శబ్దానికి వేచి వున్నాడు.
మహాసముద్ర ఘోష వినే నా నావికులు,
నన్ను కూడా ఓపికతో వింటున్నారు.
ఇంక వాళ్ళు ఏ మాత్రం వేచి వుండనక్కరలేదు.
నేను సిద్ధంగా వున్నాను.
ప్రవాహం సాగర గర్భం చేరింది.
మహామాత మరొకసారి తన కుమారుణ్ణి
హృదయానికి హత్తుకుంది.

ఆర్వలీజు వాసుళ్లారా, మీకు శుభముగుగాక!
ఈరోజు ముగిసింది.
తామర పువ్వు తన రేకులన్నింటినీ
తన భవిష్యత్కాలంపై కప్పినట్లు,
ఈరోజు, మనల్ని మూసేస్తోంది.
ఇక్కడ మనకు ఇవ్వబడిన వాస్నంతా,
భద్రంగా దాచుకుందాం. అది చాలకపోతే,
మళ్ళా మనమంతా కలసి,
విశ్వదాత ముందు అర్థిద్దాం.
నేను తిరిగి మీ సమజానికి వస్తానన్న సంగతి
మరవకండి.

మిమ్మల్ని కలుసుకోవాలనే నా వాంఛే,
కొంతకాలం తర్వాత,
కొంత దుమ్మునీ - కొంత నురగనీ
పోగుజేసుకుంటుంది, మరో దేహధారణ కోసం.
కొంతకాలం తర్వాత అంటే,
గాలిలో ఒక క్షణం విశ్రాంతిగా నిలచిన తర్వాత,
మరొక స్త్రీ, నన్ను తన గర్భాన ధరిస్తుంది.

మీకూ, మీతో నేను గడిపిన చైతన్య కాలానికి
నా శుభాకాంక్షలు.
మనం నిన్న కలలో కలుసుకున్నాం.
మీరు నా ఏకాంతమందు చేరి, పాడారు.

మీ వాంఛలతో నేను ఒక ఆకాశ హర్మ్యాన్ని
నిర్మించాను.
కాని, కల కరిగిపోయింది.
ఉషః కాలం మించి పోయింది.
సూర్యుడు నడినెత్తి మీదికి వచ్చాడు.
మనం సగంలో మేల్కొవడంతో,
అది పూర్తి రోజుగా మారిపోయింది.
మనం విడిపోవలసిందే!

"స్మృతి" అనే సంధ్య వెలుగులో,
మనం మరొకసారి కలుసుకుంటే,
మనసారా మాట్లాడుకుందాం.
అప్పుడు మీరు నాకు మరో నిగూఢమైన పాట
పాడి, వినిపిస్తారు.
మరో స్వప్నంలో మన చేతులు కలుసుకుంటే,
మరో ఆకాశ హర్మ్యాన్ని నిర్మిద్దాం.

ఆల్ ముస్తఫా అట్లా చెప్పి,
తన నావికులకు సౌంజ్ఞ చేశాడు.
వాళ్ళు తక్షణం లంగరు ఎత్తారు.
తాళ్ళు విప్పి, తూర్పు దిశకు ప్రయాణం సాగించారు.
అక్కడ వున్న వారంతా ఒకే గుండె గొంతుకతో
ఏడ్చారు.

ఆ రోదన మునిచీకట్లలో
మహాసముద్ర తరంగ ఘోషను మించి
దిగంతాల్లో ప్రతిధ్వనించింది.
ఒక్క ఆల్‌మిత్రా మాత్రం మౌనంగా వుంది.
ఆయన ఓడ పొగ మంచులో అదృశ్యమయ్యే వరకు,
ఆమె సముద్ర తీరాన నిలబడి చూస్తూనే వుంది.
ప్రజలందరూ తమ తమ నెలవులకు వెళ్ళారు.
ఆల్‌మిత్రా మాత్రం ఒంటరిగా నిలబడి,

"కొంత కాలం తర్వాత—
గాలిలో ఒక క్షణం విశ్రాంతిగా నిలచిన తర్వాత,
మరొక స్త్రీ, నన్ను తన గర్భాన ధరిస్తుంది," అన్న
ఆల్‌ముస్తఫా చివరి మాటల్ని
హృదయంలో మననం చేసుకుంది.

